ఓమ్

# శ్రీ సత్యదేవ మాహాత్మ్యము

(నిర్వచనము)

కర్త:
తటవర్తి సూర్యనారాయణమూర్తి

వెల 1-0-0

ఓమ్

శ్రీవామాతనువల్లి కాద్యుతి తటిత్ శ్రీమించ రత్నాకరా
రావం బాతతగర్జితధ్వనులు గా రాజత్ ఫణీంద్రాభ్ర శ
య్యావిభ్రాజిత సత్యదేవ జలదం బస్మన్మనోబర్హినిం
బ్రావృట్ శీతల సత్కృపామధుర ధారాసిక్తముం జేయుత౯.

శిరమందున్ ధరియించె జహ్నుతనయన్ శ్రీకంఠుఁ డస్మత్కృతా
దరపూజాపరిచర్యలన్ ముదము జెందం డేమొ, నాజీవితే
శ్వరుప్రేమం గొనుటెట్లొకో యని తపశ్చర్యన్ విరాజిల్లి శం
కరుసామేన వసించుకొమ్మ కరుణం గాపాడు నన్నెప్పుడున్.

"అనఘ, భవత్పదాబ్జరజమంటిన ఱాయి పడంతియయ్యె నా
వను గదియంగరాకు మిట బాదములం గడుగంగ నీ"మ్మటం
చను గుహు వాక్యముల్ విని స్మితాననుఁడై యటువైపు జాపు రా
మునిపదపద్మముల్ గడుప్రమోదము గూర్చుత నాకు నిత్యమున్.

క్రమముగ బుణ్యతీర్థములు గన్గొని క్రుంకి యెవండు వచ్చు వే
గమ, భువనాధిపత్యమును గాంచు నతండని తండ్రి సెప్ప స్వాం
తమున స్వశక్తి యెంచి పరితాపము వాయ నమశ్శివాయ మం
త్రమునఁ గృతార్థుఁడైన విభుతాపదు సామజవక్త్రుఁ గొల్చెదన్.

శారద భక్తరక్షణ విశారద సారవిహీనఘోర సం
సార వికారభార వివశవ్యవహార విహార మానవా
ధార విచారవార నిశితప్రతిభారచనా ప్రసన్నవై
నారసనాగ్రభాగమున నాట్యముజేయుత సత్కృపామతిన్.

శ్రీరఘురామచంద్రుని ప్రసిద్ధికి గారణభూతుఁ డెవ్వఁడం
భోరుహసంభవాననము బొందఁగనుండినవాఁ డెవం డమో
ఘోరు బలిష్ఠుఁ డెవ్వఁ డసురోన్నతపర్వతవజ్రియెవ్వఁ డా
మారుతి నాకొసంగుత సమస్తశుభంబులు మంగళంబులున్.

అమితజవాన్వితుండు వినతాత్మజుఁ డచ్యుతుఁ డెక్కుతేరు స
ర్పములకు గర్భశత్రువు సుపర్ణుఁడు తల్లియనంతదాస్యపా
శమువిడిపించినట్టి బలశాలి విహంగమచక్రవర్తి ని
త్యము సమకూర్చుగాక ప్రమదంబుసుఖంబును నాకు నెందునున్.

దనుజానీకము సాధుజీవనుల వేదన్యాయధర్మంబులె
ల్లను నాశం బొనరించుచుం జెలఁగువేళన్ దానిబోకార్చి స
జ్జనసంతుష్టియు లోకశాంతియును సంస్థాపించు హాయా సుద
ర్శన చక్రంబును పాంచజన్యమును సంరక్షించు నన్నెప్పుడున్.

III

ఆదిశక్తి పరాశక్తియై జగంబు
లేలు మాగ్రామదేవత యెపుడుగూడ
శ్రీకనకమహాలక్ష్మి రక్షించుఁగాక
సహజకారుణ్యరసకటాక్షములఁ బఱపి.

సతమున్ దాల్చునుభూతి యూ త్తతతి మెచ్చన్ భూతియే యిచ్చుఁ బ్ర
స్తుతుఁడై త్రావు విసంబు నవ్విసమె యిచ్చున్ సర్వభూతాళి కా
నతభక్తవ్రజపారిజాతుఁడగు మానాగేశ్వరస్వామి వి
స్తృతకారుణ్యకటాక్షవీక్షణములం జేకూర్చు నాయిష్టముల్.

మున్ను సుధారసాంచిత విమోహకచారు కవిత్వసంపదన్
ఎన్నికగన్న సంస్కృత కవీశ్వరభవ్యపదారవిందముల్
మన్ననమ్రొక్కి యాంధ్రకవిమాన్యుల లాక్షణికాగ్రగణ్యులన్
నన్నయ తిక్కనాది కవినాథుల కంజలిజేర్తు భక్తితోన్.

ఆంధ్రభాషావధూటికి నందమైన
తొడవులంగూర్చి మెచ్చు నాధునిక కవుల
కందఱికిగూడ గైమోడ్పులందజేతు
వినయభావంబు భక్తియు పీడకుండ.

ఘర నష్టాదశముల్ పురాణములు వేదవ్యాస సంప్రోక్తముల్
వరలున్ స్కాందపురాణమందుగల రేవాఖండమందున్న త్వా
చ్చరితంబుం దెనిగించినాఁడ కలహంసాక్షీ రమేగాదు స
త్కారుణాన్ నీరముగూడ గ్రోలు మతిలోకంబైన నైజంబుతోన్.



# కృతి సమర్పణ



వను నాఱ్వేల నియోగి వంశజుని నా
నాగ్రంథనిర్మాణద
క్షుని గౌండిన్యసగోత్రసంభవునిఁ ద్వా
చ్ఛృంభత్ పదాంభోజ చిం
తనునిన్ శ్రీతటవర్తివంశజు ననం
తా, సూర్యనారాయణా
ఖ్యుని బ్రోవంగ నిదిచ్చితిన్ గృతిగ నీ
కున్ సత్యదేవప్రభూ.





సత్యనారాయణస్వామి

ఓమ్

# శ్రీ సత్యదేవ మాహాత్మ్యము



౧

శ్రీరమణీముఖ చంద్ర చ
కోరా పాపాంధకార కోటిదినకరా!
కారుణ్యాంచిత పారా
వార శుభాకార ఘోరభవభయదూరా!

పుణ్యమునీశ్వరాంచిత తపోమహిమాన్విత విశ్వభావుకా
గణ్యహితార్థ భాసుర సుఖస్థిరవాసము వేదగాననై
పుణ్యమహాత్మ సూతమునిపుంగవ సంగతభూమి నైమిశా
రణ్యము దేవతాగణ శరణ్యము పూర్ణసరోవరేణ్యమున్.

మేలగు నయ్యరణ్యమున మిక్కిలి ప్రీతిగ గోగణంబు శా
ర్దూలముతోడఁ, బన్నగముతోడను గేకి, శుకంబుతోడ మా
ర్జాలము వీడకుండ ననిశంబు జరించుఁ బరస్పరంబు నే
కాలమునాఁ డెఱుంగని యొకానొక నెయ్యము తీవరించఁగన్.

సహజ శత్రుత్వములు మాని జంతుసమితి
వేదపారాయణము సల్పు విహంగవితతి
స్వేచ్ఛగా నెల్లచోటుల జెలంగుచుండు
రమ్యమైనట్టి నైమిశారణ్యమందు.

సతత మధురాంబుయుతజలాశయము లమిత
క్రమఫలభార నమ్రవృక్షమ్ములలరి
స్వాగతంబిచ్చు నతిథిప్రజావిశేష
రమ్యమైయొప్పు నైమిశారణ్యమందు.

బహుపురాణ వేత్త బ్రహ్మర్షి వ్యాస శి
ష్యుండు వీతరాగి సూతమౌని
సరసవాక్యరచన శౌనకాది మునీశ
సమితికెపుడు జెప్పు శౌరికథలు.

పరహితమతులగు నా ముని
వరు లొకనాఁ డఖిలలోకభద్రేచ్ఛను నొం
డొరుల ముదంబున జర్చిం
చిరి పరమార్థంబుగూర్చి శేముషి వెలయన్.

"కరుణాసాగర దేవతావర రమాకాంతామనఃపద్మబం
భర పీతాంబర శంఖచక్రధర పాపధ్వాంతమధ్యాహ్నభా
స్కర నీలాంబరసోదరా నిగమసంచారా జగత్సృష్టి త
త్పర మాంపాహి నమోనమో మురహరా త్రైలోక్యరక్షాపరా!

విమలానందకరా నమోస్తుభవతే విశ్వప్రభో శ్రీధరా
కమలాక్షాయని భక్తితో నిఖిలలోకస్వామిఁ గీర్తించు చా
సమయంబందున సూతసంయమి సశిష్యవ్రాతుఁడై వచ్చె హ
ర్షముతో శౌనకముఖ్యమౌనితతి సాష్టాంగమ్ముగా మ్రొక్కఁగన్.

పండితమండనుండు సురవందితదివ్యచరిత్రుఁడైన సూ
తుండు మునీశ్వరార్చితపదుండయి యెల్లగ్రహంబులందు మా
ర్తాండునిరీతి మిక్కిలి విరాజితుఁడై సభమధ్యమందు గూ
ర్చుండెఁ గుశాసనంబున నిరూఢతపః పరిశుద్ధ తేజుఁడై.

అటులఁ గూర్చుండియున్నంత నతనిఁ జేరి
వినయభావంబుతో మ్రొక్కి వేడ్కనిట్లు
శౌనకుఁడుపల్కె నో మునిచంద్ర సర్వ
విజ్ఞుఁడవు నీవు వినిపించు విష్ణుకథలు.

భావి కలియుగమందు నెవ్వగిది జనులు
ముక్తభయపాపులగుదురు? మోక్షమార్గ
సాధనంబెద్ది వారికిఁ జక్రపాణి
భక్తి యెవ్విధి నలవడు బలుకుమయ్య.

మూరుఁ బ్రపంచకమ్మరయ మాపును రేపును, బాపమార్గ సం
చారులు రోగపీడితులు జ్ఞానవిహీనులు దైవదూరులున్
జారులు చోరులై కలిప్రజల్ వసియింతురు వారు విష్ణు నే
తీరునఁ జేరఁగల్గుదురు తెల్పఁగదే మునివర్య మాకిటన్.

వేదవిద్యావిహీనులు విగతపుణ్యు
లల్పవాంఛులు లేమిచే నడలువారు
నన్నగతజీవు లాశాప్రయత్నదాష్ట్య
సంగతులు గలియుగప్రజల్ సంయమీంద్ర.

పాపము లెక్కుడై సం
తాపములంగాంచి వంశనాశనమగు దు
ర్వ్యాపారచిత్తులగుదురు
తాపసవర! యెట్లు వారి దైన్యములుడుగున్ ?

కపట విహీనుఁ డవైరియుఁ
గృపగలఁవాడును బరోపకృతి యనఘుండున్
ఎప్పుడును బరులకు బుణ్యం
బుపదేశించెడు జనుండు యోగినుతుండా.

పరుల మానసవృత్తుల నెఱిఁగి దోష
కలితులై వారలున్న వారలకు మంచి
బోధనలు తాను జ్ఞానియై పూర్ణముగను
జేయకుండిన మోక్షసంసిద్ధి లేదు.

ధనముఁ జ్ఞానధనము దాచక పరులకొ
సంగువాఁడె ధరను శౌరిసముఁడు
సూతమౌనినాథ! యేతపోవ్రతములు
వాంఛితార్థసిద్ధి బడయఁజేయు?

సూతుఁడు పల్కె—శౌనకవిశుద్ధయశస్క! జగద్ధితంబు ని
చేతమునందు గోరెదవు శిష్టజనుండవు ధర్మమూర్తి వీ
రీతిఁ బరోపకారము గుఱించి తలంచుటచేత విష్ణు సం
ప్రీతి గడించి హాయిగ జరింతువు నిత్యము వైష్ణవాగ్రణీ.

వినుమా శౌనక, సావధానమతివై వేధోండభాండమ్ము లె
ల్లను గర్భంబున దాల్చియున్న వరదున్ లక్ష్మీధవున్ నారదుం
డను బ్రశ్నించె నిదేవిధంబుగ, నతండుం జెప్పె దద్వృత్తమే
వినిపింతున్ వినుమోయి మానసమునన్ విశ్వప్రభుం గొల్చుచున్.

వ

శ్రీకర భక్తమునీశ వ
శీకర పద్మజ హిమాంశు శేఖర దేవా
నీకనుత సుగుణగణర
త్నాకర లోకేశ భవవినాశ రమేశా.

శౌనకాదిమునుల సందేహమును దీర్ప
సూతు డిట్లుపలికె నోతపస్వి
నారదుండు పద్మనాభుని బ్రశ్నింప
నతడు జెప్పియున్న దదియు వినుము.

నారద సంయమీంద్రుఁ డొకనాఁడు విపంచిని జేతఁబూని సం
చారము చేయుచుండి భువనంబుల మర్త్యనివాసభూమినిం
జేరి యటంగనుంగొనె విశేషకృశాంగుల రోగదుఃఖ వి
స్తారులఁ బాపజీవుల విచారపరీతుల శూన్యజన్ములన్.

కాంచి యతండు చిత్తమున గ్లానియు జాలియునొంది సుంతయూ
హించి గతార్తులై మనఁగ నెట్టుల వీరినొనర్తునంచు యో
జించి పరాత్పరుంగని భజించి యుపాయము జెప్పుమంచుఁ బ్రా
ర్థించెదనంచు నెంచి యతఁడేగె వికుంఠముదారిపట్టుచున్.

చనిచని యుండటం గనియె సంయమివర్యుఁడు నారదుండు పా
వనముని రాజపూజిత విపన్నవిమారపదాబ్జచిహ్నితా
త్యనఘుకవాటగేహము మహామహిమాన్వితశంఖచక్ర సా
ధనపటభూషితాఖిలపథమ్ము శుభమ్మను శ్రీవికుంఠమున్.

సంయమీంద్రుండు పోయెడు సమయమందు
దేవముని వచ్చెననుచు వందేయటంచుఁ
జేతులను మోడ్చి భక్తి భజించువార
లై వికుంఠపురీవాసు లనుగమింప.

ముందటు సనక సనందన మునివరుల్
గనుపింపఁగఁ బ్రతివందన మొసఁగి
సాష్టాంగపడి నమస్కారంబుఁజేయు వి
ష్వక్సేను మందహాసమున లేపి
సద్భక్తిఁ బ్రమొక్కిన జయవిజయులకు శు
భంభవతనుచు దీవనలొసంగి
వేదాంతచర్చఁగావించు బ్రహ్మర్షులన్
హస్తసంజ్ఞను సేమమడిగి తెలిసి

విష్ణుదేవుని పాదారవింద భజన
కోరివచ్చిన యక్షరక్షోభుజంగ
సురాప్సరస్సిద్ధవిద్యాధరాది సకల
దేవయోని విశేషముల్ దెలిసికొనుచు.

పోవుచున్నంతఁ దార్క్ష్యుండు పుడమినంటి
మ్రొక్కినంత నాతని శిరఁబున గరఁబు
నిమిరి కుశలంబెఱింగి మోదము ఘటించి
ముందునకు బోయె నారద మునివరుండు.

ద్వారములెల్ల దాటి కనుదమ్ములు నశ్రులు జాలువాఱఁగా
శారదచంద్రికాధవళచారు శరీరుని శంఖచక్ర మా
లారమణీయునిఁ శుభదలక్షణలక్షితునిం జతుర్భుజున్
నారదసాని గాంచెఁ దదనంతరమిట్లు నుతించె విష్ణునిన్.

శ్రీభార్గవీ మానసాంభోజ మత్తద్విరేఫా విరూపాక్ష లోకేశసంపూజ్య పాదారవిందా ముకుందారవిందాయతాక్షా విపక్షా సురోన్మత్త నాగేంద్రహర్యక్ష హేసాధురక్షా ధరారక్షణోద్యోగదక్షాయుధా సుందరాకార మానీశ హృద్వీధిసంచార లోకాళిబుట్టింపగా ధాతవై రక్షణంబందు పేంద్రుండవై యొప్పి సంహారకాలంబునన్ శూలివై యొప్పు నీదివ్యతేజంబు నీదివ్యనామంబు నీదివ్యరూపంబు నేనెట్లు వర్ణింపఁగానేర్తు లీలావతారా విచారంబులన్ మాన్పి నీపాదరాజీవబద్ధంబుగా నాదు చిత్తంబుగావించి సంసారమాయాపిశాచంబు నన్నంటకుండం గృపాంభోధివై కాచి రక్షించుమా లోకరక్షామణీ భక్తచింతామణీ దైవచూడామణీ వేదవేదాంగముల్ నిన్ను జ్ఞానంబుగా జ్యోతిగా నెప్పుడుం గీర్తనల్ సేయు నిష్కామచిత్తుండనై భక్తితోడన్ నుతింతున్ హరే కైటభారే మహానందరూపాత్రితాపాపనోదక్రియాదక్ష రక్షింపుమా చక్రధారే మురారే నమస్తే నమస్తే నమః.

ఉత్సాహము.

శ్రీరమేశ భక్తలోకసేవితాంఘ్రిపంకజా
ఘోరపాతకాంధకార కోటిసప్తసప్తి యం
భోరుహాసనాది నిత్యపూజ్య దివ్యరూప సం
సారతాపనాశన ప్రశస్త శీతలేక్షణా.

పృథ్వి.

పరాత్పర కృపారసార్ణవ ప్రపాల్యభక్తవ్రజా
సురాధిప కిరీటరత్న పరిచుంబితాంఘ్రిద్వయా
చరాచర జగద్విరోధి నృపచండ వైవస్వతా
ధరాభరణ పాహిపాహి శ్రితదాస సంరక్షకా.

మాలిని.

సకలభువనరక్షా సంశ్రితైకైకపక్షా
వికట దనుజకాలా వేదసంస్తుత్యలీలా
సుకృతిజనవినోదా శుద్ధసత్త్వానుమోదా
ప్రకట భవవినాశా భవ్యవైకుంఠవాసా.

తరంగ(?)కము.

[illegible]జనార్ధన సంసృతికారణ జలేజనయనా కృపా
పూరిత మానస పుణ్యచరిత్రక పురందర ముఖామరా
ధార రమాహృదయాంబుజ భాస్కర ధరాభరణ వేదసం
చార సుదర్శన శంఖ గదాధర సమస్తసుగుణాన్వితా.

తోటకము.

పరిపాలిత నిర్జరపాళిదయా
కర సాగరజాముఖకంజ దివా
కర దుస్తరదుర్భరగాఢతమో
హరణా పరమేశ దయాభరణా.

స్వాగతము.

శ్రీవరా విబుధశేఖర వేధో
జీవ భోగిపతిసేవిత పాదా
దేవదేవ జగతీధవ లోకో
ద్భావకారణ సదా కరుణాత్మా.

వసంతతిలక.

కారుణ్యమూర్తి త్రిజగత్పరిపాలకా సం
సారాబ్ధి మగ్నజనచారుదృఢైక నౌకా
నారాయణా మునిగణస్తుత పాదపద్మా
నీరేజనేత్ర ధరణీధరణా నమోస్తు.

రథోద్ధతము.

పరమేశ్వర సంశ్రితభక్తపరా
కరుణారసబంధుర ఆత్మపరా
శరణాగతరక్షక శార్ఙ్గధరా
పరిపాలయమాం భవబంధహరా.

ద్రుతవిలంబితము.

వరదనిత్యము పావనరూపు నిన్
స్మరణసేతును నాకము ప్రేమతో
హరవిరించి ముఖామర సేవితా
పరమధామనివాస పరాత్పరా.

పాహి లోకేశ పరమేశ భవవినాశ
ఆదిమధ్యాంత రహిత దివ్యప్రకాశ
వాఙ్మనోగోచరాతీత భవ్యవేష
భక్తజనతోష లీలావివిక్తవేష.

సురసంయమీంద్రుఁ డిటులం
బరమాత్ము ననంతుఁ జారుపద్మదళాక్షుం
బరిపరివిధుల నుతింపఁగ
దరహసితాననముతో గదాధరుఁ డనియెన్.

ఎందునిమిత్త మిచ్చటకు నీవరుదెంచితివోయి నారదా
సందియమేల నీమది విచారము నాకు వచింపుమన్న నా
నందముతో ముకుంద చరణద్వయి మానసవీథిలో శతా
నందకుమారుఁడెంచుచు జనార్దనుఁజూచి వచించె నిట్టులన్.

నానా క్లేశసమేతుల
నానాయోనిజుల నరుల నాస్తికు లఘకా
ర్యానందులు బహుజన్మా
ధీనులుగా నంట చూచితిని గోవిందా.

వారి యాబాధలెట్లు నివారణంబు
లగును? వారు సుఖాన్వితులై మనంగ
గల లఘూపాయ మెద్దియైన గలదె తెలియఁ
బలుకు మాపన్నబంధు కృపారసాబ్ధి.

నారాయణుండు పలికెను
నారద కోరెదవు నీవు నానాభువనా
ధారము మోహావిదూర మ
పారముదంబిచ్చు నేయుపాయము నైనన్.

కలదు వ్రతంబు నారద జగంబులలో నిది దుర్లభంబు కో
ర్కులు సమకూర్చు నట్టిదియు గోవిదసన్నుతముం బవిత్రమై
చెలఁగును నీపయింగలుగు స్నేహముచే నిది వెల్లడించెదం
బలికిన విన్న వ్రాసిన శుభంబుల నావ్రతి దైవమిచ్చుఁబో.

జనులు సత్యనారాయణస్వామి గూర్చి
వ్రతము విధ్యుక్తముగ జేసి సతత మిహసు
ఖము లనేకముగాంచి మోక్షంబు బడసి
ధన్యులగుదురు ప్రతివారుఁ దప్పకుండ.

"పద్మదళ చారునేత్ర యీవ్రతము దొల్లి
యెవరొనర్చిరి? ఫలమేమి? యెవ్విధాన
జేయఁగావలె వివరించి చెప్పవలయు
ననుచు నారదుఁ డడుగఁ బల్కెను మురారి.

"ఐహిక పారలౌకిక సుఖాభ్యుదయంబుల కాటపట్టు పా
పాహి సమూహ ఖండన విహంగమనేత నిరంతరాధి బా
ధాహత దీనరక్షణ సుధాంచితమైన మహౌషధంబు నా
నాహిత సాధనంబును ననారత మంగళదాయకంబగున్.

ధనధాన్యంబులు వృద్ధిజేయును సుపుత్రప్రాప్తిగావించు శ్రీ
యును సౌభాగ్యము లిచ్చుచుండును చిరాయుర్దాయముం

గూర్చుఁ గో

రిన దెల్లన్ సమకూర్చు నారదమహర్షీ యీవ్రతం బెవ్వరై
నను సద్భక్తిగ జేసినన్ ఫలితమానందంబు నిక్కంబుగన్.

జనులకు భక్తితో వ్రతము సల్పెడువారికి నాజిలో జయం
బును ధనధాన్య వాహన సమూహము సంతతిగల్గుఁ గార్తికం
బున మఘుమాసమందుఁ బ్రతిపూర్ణిమ సంక్రమణంబులందుఁ జే
సినఁ బ్రతిమాన-వాసరముఁ జేసిన జేయగవచ్చు నారదా.

ప్రతినెలగాకయున్న ప్రతివత్సరముం గడుభక్తితోడ నీ
వ్రత మొనరించఁగాదగును బాయని భక్తిగజేయువారి వాం
ఛితములు సిద్ధిజెందును, నశించు విపత్తులు సర్వదా జయో
న్నతి కలుగుꣳ యథావిధిగనమ్మి వ్రతం బొనరించువారికిన్.

ఆసక్తి గలిగిన యట్టిమానవుఁడు ప్రా
తఃకాలమున లేచి తత్తదుచిత
కృత్యములందీర్చి-కేశవ పరమాత్మ
దేవదేవేశ త్వత్ప్రీతి కొఱకు
నతిభక్తి సత్యనారాయణ వ్రతము జే
సెదను గాపాడుమా శ్రీకళత్ర—
యనుచు సంకల్పించి యంతమాధ్యాహ్నిక
క్రియ లాచరించి కీర్తించి స్నాన

సంధ్య లొనరించి దేవపూజాగృహంబు
జక్కగా దిద్దితీర్చి పూజాస్థలంబు
గోమయముతోడ నలికి ముగ్గులు ఘటించి,
పంచవిధవర్ణ చూర్ణ ప్రభాంచితముగ

దానిపై నూత్నమైన వస్త్రంబు బఱచి,
పైన బియ్యంబుఁబోసి యాపై సువర్ణ
రజతములగాని యిత్తడి రాగి మట్టి
కలశమేనియు నుంచఁగావలయునోయి.

ధనలోభము సేయకంగా
జనదీ విషయంబులోన జనుఁ డటుమీాదన్
దన శక్తికొలఁది సత్యే
శుని కాంచనవిగ్రహంబు సొంపుదలిర్పన్.

తామ్ర నిర్మితవరుణుని స్థాపితంబొ
నర్చి యాకలశమున నుంచంగవలయు
నంగదేవతలైన గణాధిపాబ్జ
భవచతుర్భుజ శంకరపార్వతీ మ
హేంద్ర ముఖ్యదిక్పతుల బూజింపవలయు.

తొలుతన్ వేఱుగ వరుణుని
గలశస్థితు బూజసేసి కలశోత్తరదిగ్
స్థలమున ద్వైమాతుర ము
ఖ్యుల స్థాపించవలయున్ సముత్సాహమునన్.

# శ్రీ సత్యదేవ మాహాత్మ్యము

పిదపఁ దూర్పుగ మంత్రవిధిఁ బూజలు ముగించి
పశ్చిమమున విభావసుఁడు మొదలు
గ్రహముల నెలకొల్పి కడుశ్రద్ధ నుత్తర
ముఖముగా బూజలు ముగియఁజేసి
పరిశుద్ధచిత్తుఁడై ప్రాచీదిశాదుల
నష్టదిగీశుల నర్చనంబు
గావించి కలశలోగల సత్యనారాయ
ణస్వామి నెల్ల బాంధవులతోడ

ద్విజులతోఁగూడి వినయ వివేకమొప్పఁ
బూజ గావించవలయు సంపూర్ణభక్తి
నాల్గుజాతుల వార లానందమొప్ప
స్త్రీలు బురుషు లీవ్రతమును జేయవచ్చు.

పౌరాణిక వైదిక మం
త్రారంభకుఁడై ద్విజుండు నటుశూద్రుండుం
బౌరాణిక మంత్రములన్
సారసదళనేత్రుపూజ జలుపగవలయున్.

భక్తినొకసారిచేసి యీవ్రతము విడప
మఱల గావించుటకు నసమర్థుఁడైన
వాని కే విధిదోషంబుగాని లేదు
భక్తియే ముఖ్యమగు మానివర నిజంబు.

సత్యదేవుని వ్రతమును సలుపువారి
యెడల హేళనజేయువా రెల్ల విధుల
దుస్సహానంతసంతాప దుఃఖదావ
పావకంబున బడుదురు దేవమాని.

సాదరభక్తిఁజేసి వ్రతమంత సమంచిత నిష్ఠతోడ నే
కాదశిఁ దత్ప్రసాదమును గైకొని భక్షణచేసి బంధుమి
త్రాదుల ధారుణీసురుల నాప్తజనంబులఁగూడి వేడుకన్
ద్వాదశినాఁడు భోజనమొనర్పవలెన్ వ్రతికింగుమారకా.

జనుఁడు దరిద్రుం డగుచోఁ
దనబంధు సఖాప్తులకు యథావిధి శ్రద్ధా
వినయములతో బ్రసాద
మ్మొసఁగినంజాలు వడయుఁ బూర్ణ ఫలితమున్.

విప్రులకు ముందుగానిచ్చి పిదప దాను
సకలబంధులతోడఁ బ్రసాదభక్ష
ణంబు గావించవలెఁ బ్రసాదంబు గొనని
వాఁడు ప్రబల దుస్సహదుఃఖభాగియగును.

చూడవచ్చిన జనుల కెవ్వాఁడు కర్త
యై ప్రసాద మొసంగడో యతఁడు వ్రతఫ
లంబు నొందంగజాలఁడు లక్షవిధుల
బాపములు జెందు వానిని దాపసేంద్ర.

సర్వహితకారి వ్రతము ప్రసాదమహిమ
మిది శుభంబులు గోరువాఁ డెవ్వఁడును బ్ర
సాదము నెపుడు నిందించరాదు భక్ష
ణమున బ్రాపించుఁ గోటియజ్ఞముల ఫలము.

ఈవిధి విధ్యుక్తముగా
నేవాఁ డీవ్రతముజేయు నెక్కుడుగా, నా
నావిధ సౌఖ్యంబులు త
ద్దేవుని కృపవలనఁ జేరు దినదిన మతనిన్.

పాలునేయి యరటిపండ్లు గోధుమచూర్ణ
మైన శాలిచూర్ణమైన పంచ
దార లేక గుడము జేర్చి నైవేద్య
మొసఁగవలె బ్రసాద మో మహర్షి.

బంధుజనులతోడ బ్రాహ్మణసంఘమ్ము
తోడ మిత్రసమితితోడఁ గూడి
ఎప్పుడైనగాని యెక్కుడు భక్తితో
సత విభుని వ్రతము జలుపవచ్చు.

విప్రులకు దక్షిణలొసంగి పిదప నాప్ర
సాదమును భక్షణముచేసి స్వామియెదుట
నృత్తగీతాదివాద్యముల్ నెఱపవలయు
వాంఛితార్థంబు బడయంగవచ్చు నిజము.

స్వామి చరణాబ్జయుగము ప్రాంజలజపీఠిఁ
జక్కగా నిల్పి యీవ్రతసాధనమున
నైహికాముష్మికసుఖంబు లందవచ్చు
నందఱును నన్ని వేళలయందుఁ గూడ.

కలియుగమందున వాంఛిత
ఫలసిద్ధి యొసంగగా నుపాయము మఱిలే
దిల నీవ్రతముంజేసి స
ఫలమొందిన వారికథలు వలికెద వినుమా.

3

శ్రీనగజాకీర్తిత భువ
నానందవిలాసవేష యాసక్తమునీం
ద్రానవరత మానసవీ
ధీనిలయా వరద సత్యదేవ సుదేవా.

వలికె సూతుండు సత్యదేవప్రభావ
కలితమైన మనోహరకథలు భక్తి
వినఁగ శౌనక ముఖ్య పవిత్రమునిగ
ణంబు మనముల హరిచరణములు నిలిపి.

ఏపీఠనుండి యీజీవకోటికి వేళ
కన్నంబు బెట్టెడి నన్నపూర్ణ
ఏపట్టణంబునఁ గాపురంబుండి య
ర్థుల కోర్కులిచ్చు భర్గుండు సతము
ఏపురి ప్రక్కనే యెప్పుడుం బ్రవహించుఁ
గలుషముల్ బాపు గంగాభవాని
ఏప్రోల వసియించి యిష్టార్థము లొసంగు
దైత్యారి బిందుమాధవుఁడు కరుణ

నేనగరమందు మరణింప నెల్లజీవు
లకు లభించునో కైవల్యలక్ష్మి యట్టి
మహితపుణ్యంబు ధిక్కృతామరపురంబు
పాపహరణంబు వారణాసీపురంబు.

ఆపురంబున నొక్క బ్రాహ్మణుఁ డనంత
దుఃఖదారిద్ర్యములు క్షుత్తుతో గృశించి
సంచరించును ధారుణీచక్రమెల్ల
నంతనొకనాఁడు వాని పుణ్యంబుకతన.

పరమకృపారసాబ్ధి భగవానుఁడు విష్ణువు వృద్ధవిప్రుఁడై
దరిసెనమిచ్చి యాతని వ్యథల్ దొలఁగింపదలంచి పల్కె-భూ
సురవర యేల నీప్రబలశోకముచేత జరింతువోయి నీ
చరితము జెప్పు చేసెదను సాయ ముపాయము నాయథావిధిన్.

పలికెన్ ద్విజుఁ డాతనితోఁ
బలురీతుల లేమివెతలు బడఁజాలక ఆ
కలిమంట కాల్చుచుండఁ బ
వలు రాత్రులు భిక్షుకై యభాగ్యుఁడనౌటన్.

తెలుగుచుండును సర్వత్ర దేవ నాదు
కష్టములు దుఃఖములు బాయఁగా నుపాయ
మేదియైనను జెప్పి రక్షింపుఁడనిన
జాలిగొని పల్కెనిట్లు విశ్వప్రభుండు.

సత్యదేవు వ్రతము జలుపుము కష్టముల్
వాసి వాంఛితార్థ ఫలముగలుగు
ననుచు దద్విధానమంతయు నెఱిగించి
మాయమయ్యె మోక్షదాయి శౌరి.

మఱునాఁడే యీవ్రతమును
జఱుపుటకై నిశ్చయించి శ్రద్ధాభక్తిం
బరమాత్మునిఁదలఁచుచు భూ
సురుఁ డెట్లో రాత్రి గడపి సూర్యోదయమై.

వెలుఁగు రాఁకకు బూర్వమే ద్విజుఁడు కాల
కృత్యములు దీర్చి నేఁడు ప్రాప్తించు ధనము
తోడ వ్రతమును జేతు ముందుగ నటంచు
బహుముదంబున భిక్షకై బయలుదేఱె.

దినదినంబును బ్రాప్తించు ధనముకంటె
నెక్కుడుగ విత్తములభించె నెల్ల మిత్ర
గణముతో బంధుజనులతో గలిసిచేసె
సత్యదేవుని వ్రతము నిశ్చలపుభక్తి.

అతిశయభాగ్యసంపద లనంతముదంబును హెచ్చి దుఃఖసం
తతులు దొలంగి కష్టములు దాపములున్ నశియించ బ్రాహ్మణుం
డతులిత శాంతిసౌఖ్యములనంది కృతార్థత జెందెఁ బిమ్మటం
బ్రతినెల నీవ్రతంబును దిరంబుగ జేయఁగ సాగె భక్తితోన్.

నారద, పాపకానన ధనంజయమై సకలార్థసిద్ధి జే
కూఱుచు నీవ్రతంబు సుభగుండగు బ్రాహ్మణుఁడట్లుచేసి సం
సారసుఖంబులంది యవసానము నందునబొందె మోక్షముం
గోరికలెల్ల వేగసమకూర్చువ్రతం బిదియొక్కటే సుమా.

సర్వదుఃఖోపశమనంబు సద్వ్రతంబు
దద్విధానమునెల్ల మాధవుఁడు నార
దునకు జెప్పినవిధి దెల్పితిని మహర్షి
శౌనకా పుణ్యదములు కేశవుని కథలు.

౪

శ్రీసనకసనందన ప
ద్మాసన శేషాహి పూజితాంఘ్రిసరోజా
దాసజనాధి వ్యాధి
త్రాస నివారణ మహాత్మ తతకరుణాత్మా.

సూతుఁడు హరికరుణా వి
ఖ్యాతుఁడు బహుశాస్త్ర సారకథకుఁడు చెప్పెం
బూతముని వ్రాతమునకు
శ్రీతన్వీరమణుకథలు చిత్తము లలరన్.

తొల్లి బ్రాహ్మణుఁ డొకఁడు బందుగులఁగూడి
తనయథాశక్తి సత్యవ్రతంబుజేయు
నవసరంబున గట్టెల నమ్ముకొనుచు
దిరుగుచుండెడు నాఁడొకఁ డఱుగుఁదెంచి.

కాంచి తృష్ణాతురుండౌట గదలి లోని
కేగి ద్విజవరునకు దండమిడి మహాత్మ
ఏమి వ్రతమిది ఫలమేమి యెఱుఁగఁ జెప్పఁ
డనుచుఁ బ్రార్థించి యడుగఁ బల్కెనుద్విజుండు.

సత్యదేవుని వ్రతమిది సర్వకామ్య
సిద్ధి దీనికి ఫలితంబు సిరులు-సుఖము
పుత్రపౌత్రాభివృద్ధి సంపూర్ణముగను
దనరె నాకని పల్కిన విని యతండు.

నేనుం జేసెద భక్తిగ
నీ నాఁడీ కష్టములన్ని యీవ్రతమనుచున్
మానసమందుఁ దలంచె న
నూనంబగు హర్షమున దనుశ్రమవాయన్.

ప్రతిదినము వొందు ధనమున
కతఁ డిబ్బడి వొందగలిగె నజ్ఞాతాత్ముం
దతకారుణ్యపయోనిధి
వ్రతదైవము సత్యదేవవరదుం గొలిచెన్.

సర్వభూతంబులందు వానంబుజేయు
దీనరక్షణ తత్పరుఁడైన ప్రభుఁడు
సత్యదేవుండు, తత్కృపన్ జగమునందు
సాధ్యవస్తువు గలదె యెచ్చటనుగూడ.

మోదమునుబొంది వ్రతము ప్రసాదమునకు
వలయు వస్తువులను గొని స్వగృహమేగి
బంధువులతోడ గూడి సద్భక్తిఁ జేసె
వ్రతము వెంటనె తత్ప్రీభావంబుచేత.

సకల సంపత్తు లతనిపజ్జను నసించె
దుఃఖశోకాదులన్నియు దొలఁగిపోయె
నైహికానందసౌఖ్యంబు లనుభవించి
విష్ణుసాయుజ్యము బొందెఁ బిదప నతఁడు

చదువరిగాఁడు శాస్త్రములసారమెఱుంగఁడు యోగసిద్ధియా
యదియునుగాదు యజ్ఞఫలమా యన గాదు మఱెట్లు భూరి సం
పదలను మోక్షముం గనఁగ శక్తుఁడయ్యెను? సత్యదేవునిన్
సదమలభక్తితో గొలుచు సజ్జనులందరె యిష్టభోగముల్.

తలఁచిన యంతనే వాంఛిత
ఫలములు నేకూర్చి సర్వభయములు దుఃఖ
మ్ములు మాన్పఁగల్గు నితమిది
కలి నీవ్రతమునకు సాటిగలదె మహర్షీ.

X

శ్రీకుచమండల కస్తూ
రీకలిత విశాలవక్ష శ్రితజనపక్షా
లోకాధిప సంరక్షా
లోకిత కారుణ్యరస విలోలకటాక్షా.

వినుము శౌనకముఖ్య సన్మునిగణంబు
వినఁగ సూతుండుపలికెఁ బృథ్వీతలంబు
నందు నీవ్రత మొనరించి యార్తి బాసి
నట్టిధన్యుల చరితంబు హర్ష మొప్ప.

ధరలో నుల్కాముఖుఁడను
నరనాథోత్తముఁడు విజిత నానాధరణీ
శ్వరుఁ డమరు ధార్మికుఁడు భూ
సుర సేవావ్రతుఁడు నిత్యసూనృతరతుఁడున్.

ఆమహీపాలుభార్య సాధ్వీమతల్లి
భర్తృసేవాపరాయణ పావనాత్మ
ఆమెతోఁగూడి సకల సౌఖ్యాబ్ధి దేలి
పార్థివుం డొప్పెఁ గేశవభక్తుఁడగుచు.

ఆపృథివీశుఁ డొక్కదినమం దొక పుణ్యనదీతటంబునన్
శ్రీపతి పాదపద్మములు చిత్తమునందున నిల్పి సర్వసం
తాప వినాశకంబగు వ్రతంబును బంధులగూడి చేసె నా
హా! పలుకంగ శక్యమె తదద్భుతభక్తి వినమ్రతావిధుల్.

వణిజుఁ డొకం డమేయధనవస్తుచయంబులు రత్నరాశులున్
మణులును గాంచనంబు గొనినావ పయిం జనుదెంచు చాయెడన్
జనపతి సేయు నావ్రతము జక్కఁగ జూచి యతండు జేనితో
ననియె నృపాల యేమివ్రత మాదృతిఁ దెల్పఁగ దే యటంచనన్.

ధనము భాగ్యంబు భద్రసంతతులు గూర్చి
జనుల కెప్పుడుఁ గల్పభూజంబువోలె
వాంఛితార్థంబు లొడగూర్చు వ్రతము జేయు
చుంటి సంతతి గోరుచునుంటి నోయి!

దుఃఖశోకాదులను బాఱద్రోలి బహుళ
సౌఖ్యము లొసంగు వ్రతమిది సాధువర్య
ధనము వరపుత్రపుత్రికాధనము గోరి
చేయుచుంటిని వ్రతమని చెప్పుటయును.

ధరణీశుని కథనముచే
బరితృప్తిం గాంచి వణిజవర్యుఁడు మనముఱ్ఱ
మఱలించి వర్తకముపై
నఱిగెను దనయింటి కతులితానందుండై.

సంతానము సౌభాగ్యము
సంతత వార్తయ్యుగూర్చు సద్వ్రతశుభవృ
త్తాంతమ్మెల్ల సర్వమును దన
కాంతకు నెఱిగించి యతఁడు క్రమ్మఱఁ బలికెన్.

మనకెల్ల సుఖములున్నవి
యనిశము సంతానలాభమందఁగ మననె
మ్మనములు వాంఛించెడుగా
వున దరుణీ యీవ్రతంబు బొనఱుపవలయున్.

మనకు సంతతిగల్గిన మఱువకుండ
భక్తి సత్యనారాయణ వ్రతము మనము
సేయుదమటంచుఁ బత్నితోఁ జెప్పి మ్రొక్కు
కొనియె సాధువు సత్యదేవుని దలంచి.

పూతచరిత్ర ధర్మగుణభూషిత వర్తకు ధర్మపత్ని యా
రాతిరి భర్తతోడ మకరధ్వజకేళినిగూడి చిత్తకం
జాతము కంజనేత్రు చరణద్వయమందు నపత్యవాంఛతోఁ
బ్రీతిగనిల్పె భావినిలభించు శుభోన్నతులం దలంచుచున్.

పావనశీల యీపగిది భర్తనుగూడిన నాటిరేయి యా
దేవుని సత్కృపామహిమ దెల్పుటకోయనఁ దాల్చె గర్భమున్
ఆవణిజుండు బాంధవులు నాప్తులు సంతసమందుచుండ లీ
లావతి గర్భభారమున లాలితయయ్యెఁ గ్రమక్రమంబుగన్.

తొమ్మిది మాసముల్ సనినతోడనె కోమటిభార్య మంచిల
గ్నమ్మున సౌకుమార్యమునుగాంతియువన్నెలుమీఱుచుండనం
దమ్ములరాశి బుత్రిఁగనెఁ దక్షణమే వణిజుండు జాతక
ర్మమ్మొనరించె-వారి యనురాగము చెప్పఁగ మాటలున్నవే.

దినదినము శుక్లచంద్రుని తీరుగలిగి
పట్టి యెదుగుచునుండెఁ గాబట్టి శిశువు
నకుఁ గళావతి సార్థకనామ మయ్యె
బాల చక్కదనంబున బరిఢవిల్లె
తనయ కలిగిన మిగుల మోదంబు జెంది
సత్యదేవుని కరుణకు సంతసించి
భర్తతోడ లీలావతి పలికె మధుర
భాషణమ్ములు—జీవితేశ్వర వినుండు

మనకు సంతతి సత్యదేవుని మహత్తు
వలన గలిగిన దద్విభువ్రతము జేతు
ననుచు బల్కితి రదిచేయ నగునుగాదె
నేఁడు మనయింట బాల జన్మించియుంట.

అనుచుం బల్కిన భార్యను
గనుగొని వర్తకుఁడు వలికెఁ, గాంతా వ్రతమున్
మన యీపుత్రిక పెండ్లియు
నొనరింతము లెమ్ము రెండు నొక కాలమునన్.

తనపల్కుల్ వినలేదు భర్తయని యాతన్వీశిరోరత్న మా
త్మను జింతించి స్వభర్తృవాక్యమునకుం బ్రత్యుత్తరం బీయలే
కను సత్యప్రభుపాదపద్మములు హృత్కంజమ్మునన్ నిల్పి మ్రొ
క్కెను క్షంతవ్యులమంచుఁ జిత్తము భయక్లేశమ్ములన్ నింపఁగన్.

తన ప్రాసాదమనర్ఘరత్నములతో దాశార్హ కారుణ్యసం
జనితామర్త్యపిలాసినీతులితకన్యారత్నరాజంబుతో
దనరంగాఁగని తల్లిదండ్రియు మహామోద్యద్దర్శపాథోధిలో
మునుఁగంజొచ్చిరి పుత్రికామధురవాక్పూరంబు ప్రాపించుచున్.

తనకు సంతతిలేదు లేదనుచు హృదయ
మందు మాతృత్వదీప్తి చల్లారుచుండఁ
గడు నిరుత్సాహభావంబు గ్రమ్మియున్న
వేళ జన్మించె వారికి విబుధవల్లి.

భూషణంబుల ధగధగల్ పూవుబోఁడి
మేని నిగనిగల్ గాంచిన మించుగముల
పోత పోసినయట్టు లపూర్వరూప
వతి కళావతి యొప్పెఁ జూపఱు నుతింప.

జననీజనకుల బాంధవ
జనుల సమాదర శుభోక్తి శైశవమెఱుఁగం
గనుచుఁ గళావతి దేహం
బున జొఁఱబడె జవ్వనంబు పూర్ణకళలలోన్.

సరిగంచు బంగారు జలతారు వలిపెంపు
జిలుగుమెత్తని పట్టుచీరకట్టి
మిలమిలమని మెఱుంగుల లేతనీలము
రంగైన పైఠిణీ రైకదొడిగి

చూడఁ జూడఁగ వింతసొబగు లీనెడు ముద్దు
మోమున గుంకుమబొట్టు పెట్టి
ప్రోవులై కమ్మని తావులు వెదజల్లు
పూవుగుత్తులు జడం బొందుపఱచి

చేత వీణ ధరించి సంగీతలహరిఁ
దేలియాడుచు వినువారిఁ దేల్చు నాక
ళావతీ దివ్యసౌందర్య లాలితంబు
సాధుహార్ద్యంబు సంతోషసాగరంబు.

ఈవిధిఁ బుష్పితలతవలెఁ
దావులు విరజిమ్మ నిజసుతాప్రాయము సం
భావించి వర్తకుఁడు లీ
లావతితోఁ జెప్పి యాప్తులను గని పలికెన్.

పరమహితైషులార, నిరవద్యగుణాంబుధులార భార్గవీ
వరసుతులార పూజ్యులగు బాంధవులార వినుండు దేవతా
వరముననో పురాసుకృతభాగ్యముచేతనో పుట్టెఁ బట్టి త
త్పరిణయ మింక జేయఁగనుపాయముసాయము జేయుఁడందఱున్.

తనయులు లేనందున నీ
తనయయె నాయఖిలవస్తు ధనసముదాయం
బున కధికారిణి యటు గా
వున నీమెకు దగిన వరునిఁ బూర్ణసుగుణినిన్.

కులము విద్యయు రూపంబు గోత్ర సంప్ర
దాయములు జూచి యవ్వన ప్రాయుఁడైన
వరుని గొనివచ్చి కొమరిత పరిణయంబు
జేయ మీ సహకార కాంక్షితుఁడ నేను.

అందొకఁడు కాంచనపుర
మందు ప్రవేశించి కాంచె నచ్చట సుగుణా
నందుని వినయసమన్వితు
నిం దమకోరుపురుషునిన్ వరునిన్.

అందఱి మోహాపెట్టెడు శుభాననమందున నెల్ల వేళలం
జిందులు ద్రొక్కు సస్మితముచే విలసిల్లెడు వానిఁ బల్కుతీ
య్యందనమున్న వాని నవయవ్వనరూప విలాససౌమ్యమూ
ర్తిందన పుత్రికాధవునిఁ దెచ్చిన గన్గొని వైశ్యముఖ్యుఁడున్.

తనభార్యయు బుత్రియు నా
తని నల్లునిగాఁగ గూర్మి ధవునిగ వాంఛిం
చిన విధమంతయు నెఱిఁగిన
వణిజుఁడు నిజబంధుమిత్ర వర్గసహితుఁడై.

మంచి లగ్నంబు జూచి కుమార్తె నతని
కిచ్చి పెండిలి గావించె నెల్లవారు
వైభవోపేతమైన వైవాహికోత్స
వము గనుంగొని మెచ్చిరి బహువిధముల.

అట్లు బెండిలి గావించు నప్పుడైన
నతఁడు సత్యనారాయణవ్రతము మాట
మఱచె లీలావతి పతియమర్షభావ
మెఱిగి మాట్లాడలేకుండె వెఱపుతోడ.

మఱికొంతకాల మఱిగిన
తఱువాతను వర్తకుండు తనజామాతన్
దరుణీ గాఢాలింగన
పరవశునిం బరమహర్షపథసంచారున్,

కనుఁగొని పల్కె నోయి మనకార్యములెల్లను దీఱె; నిచ్చటన్
మన కులవృత్తి వర్తకము మానుట ధర్మముగాదు లెమ్ము నీ
వును నిపుణుండవన్నిటను బోవుదమింక విదేశయాత్రచే
ధనములభించు గష్టములతాల్మియు నేర్వఁగవచ్చు లెమ్మనన్.

తనమనోహరిరూపు గనినంతగల్గు నా
నందంబుబాయ మనస్సురాక
తనచాన మధురభాషణముచే గల్గెడు
గిలిగింతత్రోయఁగా వలనుపడక
తనహృదయాబ్జపీఠిని వసించుపడంతి
యెదుట లేకున్న సహింపలేక
తనలేమ కౌగిలింతలబుట్టు సైకంబు
జాఱ నిచ్చుటకైన శక్తిలేక

దుస్సహావియోగభావన ద్రోయలేక
మామయానతి జవదాట మాటరాక
మనసు రెండు తుఫానుల నణఁగియుండ
పలుకురాకుండె నతనికే తెలియకుండ.

అంతట నాతం డెట్లో
స్వాంతము హాయిగ నొనర్చి చని లోనికి వృ
త్తాంతము నెఱింగించెం దన
కాంతకు; వినినంత నామె గాద్గదికముతోన్.

ఘన బాధాసూచక ని
స్వనమున బాష్పాంబుధార జడిగ బ్డిడి యా
కనుఁగవతోఁ బలికినఁ, బతి
యనునయమున నూఱడించి యనె ననబోఁడీ!

నను ప్రయాణమ్ము గమ్మనినాఁడు మామ
పోదునా యన్న నిన్నీడి పోవలేను
ఉందునాయన్న బెండ్లాముముందు లోక
మే మఱచెనందు రూరిలో నెల్లవారు.

నిను విడనాడి పోవుటకు నేబడు బాధ పరాత్పరుం డెఱుం
గును మఱి తప్పదయ్యె మనకుం గులవృత్తి క్రయంబు విక్రయం
బునుగద వేగ వచ్చెదను ముగ్ధ! భవత్స్మృతి మార్గగామినై
యనుదినమున్ స్మరించెదను హాయిగ నమ్ము కురంగలోచనా!

వారి యన్యోన్య మధురసంభాషణంబు
వినుచు నొక వ్యక్తి హాయని వికృతముగను
నవ్వుట యెఱింగి గుర్తించినారు కారు
ఆతఁ డెవ్వఁడో కాదు సత్యప్రభుండె.

అతికష్టంబుగఁ దనప్రియ
సతి కౌఁగిలిబంధనంబు నడలించి నియో
జిత భువనంబుల మామకు
జతగా నాకందు వోయె సంసిద్ధుండై.

వ్రతమొనర్చెదనని మున్ను పలికియుండి
వర్తకుఁడు భాగ్యమదమున బలిసినాఁడు
తగినరీతిగ శిక్షింపదగు నటంచు
సత్యదేవుండు రూక్షవీక్షణము బఱపె.

"పాపంబులు గష్టంబులు
వాపి శుభంబులను గూర్చు వ్రతముఁ మఱచెన్;
త్రేపటి నుండియె కోమటి
కాపత్తులు గల్గుగాక" యనుచు శపించెన్.

కాలనియతుఁడై వణిజుండు గదలె వర్త
కమున కల్లుండు వెంటరాఁ; గాంత బిడ్డ
లింటనే యుండి బెంగచే నీవియోగ
వసధి యెల్లెల్లో దాటుచు మునుఁగుచుండ.

శుకపికశారికానికరకూజితముల
దనకాంత మధురభాషణము వినుచుఁ
బూవుల కమ్మని తావు లాఘ్రాణించి
నంతఁ గాంతాస్పర్శ మనుభవించు
చెలిమి శేతెని శీతల చంద్రికలయందు
దనకాంత మధురస్మితంబుగనుచు
జలపక్షి మిథున నిర్మల విలాసములందు
సతితోడి కూటముల్ జ్ఞప్తిగొనుచు

స్వప్నశయ్యల భార్యతో జాగరంబు
సలుపు చానందవీచికావళుల నూగు
భావనాజగమున స్మృతిపథమునందు
మనసు పోసిచ్చు మెచ్చు జామాతయపుడు.

తొలిజాము కోడి కూసిన
మలయానిల డింభకుండు మసలినచోఁ జ
క్కలిగింత గలిగి విరహము
సలసలమని కాచి వేడి శ్వాసలు విడుచున్.

* * * *

సింధునది ప్రక్కనున్న సుశ్రీయుతంబు
రత్నసానుపురంబు జేఱంగ జనియె
సత్యదేవుని శాపంబు సరణి దుఃఖ
ములును వారిని జేఱంగ మొదలుపెట్టె.

రాజగృహమందు నాఁడె చౌర్యంబుజేసి
వస్తువులు దెచ్చి దొంగ లా వణిజులున్న
యింటి యఱుగుపై గూర్చుండి రింతలోన
నగరరక్షకభటులు కన్పడినయంత.

విత్తమంతయు నచటనే విడిచి వేసి
భయముచేఁ జోరులటనుండి పఱుగులిడిరి
సత్యదేవుని దివ్యత్వశక్తిచేత
రాజభటులెల్ల ఆధనరాశిఁ జూచి,

వణిజులే దొంగలనియెంచి భటులు వారి
ధనము సర్వస్వమును గొని తమనృపాలు
మోల నిలిపిన వారలే ముచ్చులని త
లంచి కారాగృహంబునం దుంచుటయును;

వణిజులు రాజుతోడ "నరపాల, దయామతి, మాదు విన్నపం
బును వినగోరుచుంటిమి ప్రభూ బహుదూరమునుండి వ ర్తకం
బున కఱుదెంచియుండ మము ముచ్చులటంచటుకట్టి తెచ్చి నా
రని విలపించుచున్న వినఁడయ్యె నృపాలుఁడు దైవమాయచేన్.

చోరులు దుర్గమ పథసం
చారులు క్రూరు లొకరేయి సాధుగృహమునన్
దూఱి ధనావళులను జే
హారి సతిం గూతు బల్విన్నై గొనిపోవన్.

ఆయమయుం గుమార్తెయు భయాతురలై కురరీవిధంబునం
గూయిడుచుండఁ గాంచి తమకున్ ధనరాశులు చాలుఁజాలునం
చాయెడఁ గాంతలన్ విడిచి యావిపినాంతరమందు మాయమై
పోయిరి దొంగ లావడఁతి పుత్రిక యెట్టటో మెల్లమెల్లనన్.

జనపదంబులు జేరి సజ్జనులయిండ్ల
దిరిపెమెత్తుచు నాకలి తీర్చుకొనుచు
శీలమును గాచుకొనుచు గాంతాలలామ
లెట్టులో గాలముం బుచ్చు నట్టివేళ.

రంగురంగుల బనారసు చీరలంగట్టు
నతివకుగట్టుగుడ్డైన లేదు
రత్నభూషలుదాల్చు రమణి కీనాడింట
యురకాను రాగిరేకైన లేదు
ధనరాసు లనయంబుగొని చేతవిరజిమ్ము
చాన కీవేళ గవ్వైన లేదు
వివిధ భక్ష్యములతో విసుగునాతికిఁ గడు
పార దినుట కన్నమైన లేదు

పూలపాన్పున నిదురించు పూవుబోడి
పండుకొనుటకు జింకిచాపయును లేదు
సత్యదేవుని రూక్షవీక్షణము ముందు
మర్త్యులే చాలరన్నచో మనుజులెంత ?

కాలచక్రంబు మాఱ్పులు గలదియగుట
మనుజుఁ డద్దానబడి కష్టమును సుఖంబు
బొందు సుఖమునే జీవి యెప్పుడునుగోరుఁ
గాని యందుల కెవ్వండు కర్తయగును ?

ప్రతిదిన మా కళావతి పరాగసమావృత దేహవల్లియై
యతుకులగుడ్డ కట్టుకొని యాకలిచిచ్చు దహింపఁ బూర్వజీ
వితి మధువాసనల్ దలఁచి వేదనఁజెందును గాలయోధశి
క్షితయయి బిచ్చమెత్తుకొనజేసిన దెవ్వఁడు? కాలదైవమే.

మెలమెల్లన నడచుచు నా
కలి యెట్లో తీర్చుకొనుచుఁ గాంతలిరువురుం
గొలఁది దినంబులకున్ స్వ
స్థలముంజేరిరి జనంబు సంతోషింపన్.

తనకుం దల్లికిఁ దిండి గుడ్డ కరవై దారిద్ర్యపీడా ప్రభం
జన ధాటింబడి యేడ్చుచుండ నచటన్ నాథుండు కారాగృహం
బున శోషిల్లఁగ మామతోడను-దినంబుల్ మాసముల్ దాటె దే
వుని కోపంబపుడింత తగ్గుటయు నప్పూఁబోడిపుణ్యంబుచే.

మంగళ తూర్యధ్వనులు సె
లంగఁగ నిజబంధుమిత్రులం గూడి వ్రతం
బుం గావించు ద్విజోత్తము
నిం గాంచి కళావతియు మనీషతతోడన్.

సాంతముగఁజూచి వ్రతము నత్యంత ముదము
తోడ తత్కథవిని భక్తితోఁ బ్రసాద
భక్షణముజేసి నిర్మల భావమంది
చేతను నివాసమంత బ్రశ్నించెఁదల్లి.

రాతిరి మెచ్చట నుంటివి
కూతుర, యేమైన దినుటకున్ దొఱకెనె లే
దా తల్లి చెప్పుమనుచుం
బ్రీతిగ నడుగుటయు దెల్పె రేయిచరితమున్.

కష్టములు దీఱిపోయెడికాల మంత
జేఱుటయును గళావతి శ్రీకళత్రు
దలఁచి వెతలెల్ల బాయుఁగాగల యుపాయ
మనుచు భావించు తల్లితో ననియెనిట్లు –

"పిల్లలులేరు లేరని తపించుచు బిడ్డలు గల్గినంతనే
యెల్లఱు మెచ్చునట్లు వ్రతమే నొనరించెద నంచుదండ్రి గా
రల్లపు డక్కఱ మ్రొక్కుకొని రంటగ దమ్మరొ సత్యదేవునిం
దల్లి! జనించినానటగదా ఇటు లీవ వచించియుండవే.

వ్రతమును దల్లీ చేయని
కతమున మనకిట్టి ప్రబలకష్టము లొదవెన్
వితథంబయ్యె ధనంబులు
జతనము సేయుదము వ్రతము జఱుపుట కిపుడే.

అదివిని లీలావతి తన
హృదయంబున వ్రతముమాట యెంచుచు మివులన్
సదమల భక్తిగఁ దలఁచెను
త్రిదివేశారాధ్యసత్యదేవుని పదముల్.

చేసి రత్యంత భక్తితో శ్రీనివాసు
పాదపద్మంబు లాత్మలో భద్రపఱచి
కర్మ పరిపక్వ మగువేళ గలుగు మంచి
బుద్ధి ప్రాణుల కన్యథా పొడమకుండు.

కారుణ్యాంబుధి దీనవత్సల హరీ కళ్యాణసంధాయకా
నేరంబుల్ క్షమియించుమా జడులమై నీపూజలన్ వీడుటన్
దారిద్ర్యంబు మనోవ్యథల్ గలిగె నేత్రద్వంద్వ మీనాఁడు వి
ప్పాతెన్ గర్వము మత్తువీడినది దేవా రావె, కాపాడవే.

కల్పవృక్షంబు ప్రక్కనే కలిగియుండ
ముండ్లచెట్టును సేవించు మూర్ఖులొలె
వేదనుత సత్కృపాళు నిన్ విస్మరించి
నాము క్షమియించి మన్నించుమా మహాత్మ.

నాపతి యల్లుని తోడఁ
వ్యాపారములందు లాభమంది సుఖముగన్
త్రోవే వచ్చేడునట్లు కృ
పాపాథోధి యొనరించి పాలించుమమున్. "

భక్తితో వారు చేసిన ప్రార్థనంబు
బూజలనుగాంచి సత్యదేవుండు మెచ్చె,
దీక్షగి వారికి శుభపరంపరలు గూర్ప
నెంచి సస్మితుఁడై కరుణించిచూచె.

చంద్రకేతుభూమీపతి స్వప్నమందు
సత్యదేవుండు శాసించె — సర్వబంధ
ముక్తులనుజేసి వణిజులన్ మొదటియట్ల
ధనసమేతులఁ జేయుము తప్పదేని.

నాకనుఁగవలో నెఱ్ఱని
రేకయె నీయఖిలవసుసమృద్ధులు భాగ్యా
నీకము నాశము జేయును
గాక యనుచు సత్యవిభుఁడు కట్టడిచేసెన్.

వనజసంభవ ముఖ్యదేవతలు మునులు
గాంచఁజాలని విశ్వరక్షకుని స్వప్న
మందు గన్గొని ధన్యాత్ముఁడయ్యె రాజు
పూర్వభవమున జేసినపున్నె మేమొ.

ఉదయంబగుటయు భూపతి
యమలంబగు భక్తితోడ సజ్జాతాత్మున్
మదిలో నెంచుచు శోభా
స్పద సభకే తెంచి పిలువఁబంచె వణిజులన్.

మీసంబు గడ్డంబు మిక్కిలి పొడవుగాఁ
బెఱిగి చూపఱకు నివ్వెఱఘటింపఁ
గుఱుచలాగులు పొట్టికుళ్ళాయి లవయవం
బులకు వదులులయి పోయియుండ
నెడమ కాలునకున్న కడియము గజదొంగ
లనుటకుఁ బ్రబలసాక్ష్యమ్ముసంగఁ
గొలిచితూచి యొసంగు కూటిచే మునుపటి
కోమలత్వము కైదుఁ గొట్టుఁబట్టఁ

ప్రాణములు కన్నులందు మాత్రంబు నిలువ
వికృతరూపంబు దైన్యంబు విస్తరింప
నిత్యదండంబు సంకెల నిర్వహింప
నృపతిమ్రోలకు జనుదెంచి నిలిచిరంత.

వర్తకుల నిర్వురను గౌరవంబు జేసి
చేతిసంకెల దీయించి ప్రీతితోడ
బలుకురాజేంద్రునకు మ్రొక్కి నిలిచిరంత
నబ్బురము వేడ్క సంభ్రమ మావరింప.

వారలు సత్యదేవుని ప్రభావము దొల్లి వ్రతంబు చేయ ధి క్కారముజేసి తామిపుడు కష్టములందుట గుర్తెఱింగి ల క్ష్మీరమణా కృపాభరణ చేసినతప్పు క్షమించు” మంచు వి స్తారమునేడ్చు వారిని యథావిధి నూఱడిలంగబల్కుచున్.

క్షురకర్మము లొనరించఁగఁ
బరిచర్య లొనర్పఁజేసి బహువిధ నూత్నాం
బర భూషణశోభితులై
వరలంగాఁజేసి పలికె వారలతోడన్.

దైవవశమున మీరు నితాంతదుఃఖ
ములను బొందితి రిక భయంబునకు దావు
లేదు చింతించకుఁ డటంచు నాదరించి
పలికె భటులను జూచి నృపాలవరుఁడు.

వీరి ధనమున కిబ్బడి విత్తమొసఁగి
గారవముతోడ వీరి స్వగ్రామమునకు
బంపివేయుఁడు నాకు నీవర్తకులకు
నెయ్య మింతటినుండి వాంఛింతు నేను.

నరపతి యానబూని వయనమ్మయి వైశ్యులు వస్తువాహనో
త్కరమును రత్నముల్ మణులు గాంచనముంగొని హర్షచిత్తులై
యఱిగిరి పత్నులంగనెడి యాసయుఁ మోహముమిన్నుముట్టఁగాఁ
బరమకృపాబ్ధి మాధవునిపాదసరోజములన్ స్మరించుచున్.

౬

శ్రీలోకాధిప మకుట మ
ణీలలిత ఘృణీవిలిప్త నీరజచరణా
లీలాకల్పిత భూతల
జాలానిశ పాపతాపజలనిధితరణా.

అవధరింపుము—సూతమహర్షి శౌన
కాది మునితల్లజులకు బ్రహ్మాత్మజునకు
వాసుదేవుండు నుడివిన వ్రతచరిత్ర
శేష మీరీతిఁ దగురీతి జెప్పఁదొడఁగె.

మంగళపురస్సరంబుగా మహితరత్న
రాజి బండ్లపై నెక్కించి రాజధాని
వీడి స్వపురంబునకుఁ బోవు వేడ్కతోడ
గదలిరా బేరు లిద్ద ఱాక్షణమునందె.

నది జేఱి బంధుగులతోఁ
బదిలంబుగ నావయెక్కి పయనించుచు స
ముద్రమునఁ దమ దొల్లిఁటి యా
పదలున్ గడచిన విధంబు బరిపరివిధులన్ —

తలఁచుచుం బోవుచుండ సత్యప్రభుండు
వర్తకుని చిత్తనైర్మల్య భావమెఱుఁగ
వృద్ధవిప్రరూపముదాల్చి వెడలివచ్చి
వణిజునింజూచి దీవించి పలికెనిట్లు.

"ప్రబలదారిద్ర్య దుఃఖమ్ము రాత్రిబవలు
నన్ను వేధించెడిని ద్విజుండను రమేశు
సత్యదేవుని వ్రతమును జలుపనెంచి
యర్థినై నిన్ను జేరితినయ్య యిపుడు.

నీకుండోచిన విత్తము
నాకొసఁగుము తృప్తిగల్గు నాదుఃఖమ్ముల్
నాకష్టమ్ములు వాయుట
యేకాక శుభంబులొదవు నెప్పుడు నీకున్.

నీయొసంగిన ధనముతో నేను సత్య
దేవుని వ్రతంబుజేసి సంతృప్తిఁగాంతుఁ
బ్రాప్తమయ్యెడినోయి తత్ఫలమునీకు
శ్రేయములుగూడ గల్గు సమృద్ధిగాఁగ.

అనిపల్కు బ్రాహ్మణోత్తము
గని నవ్వుచు వర్తకుండు కటువుగఁ బోపో
ధనమా పాపము ధనమా
కొని పోవంగలవె దాచుకొంటివె యిచటన్.

అనుచుఁబల్కు నతని యావచనములకు
వింతనవ్వు నవ్వి స్వాంతమందు
వణిజు మదము గర్వభావంబు దంభము
తగ్గలేదటంచుఁ దలఁచి హరియు,

"శకటములమీద తెచ్చిన చాలధనము
నావలో నింపినావుకావే విశేష
ధనికుఁడవునీవు లేదు లేదనఁగ దగదు
స్వల్పమైన యొసంగిన సమ్మతంబు.

దేశకాలముల్ పాత్రము దెలిసి చేయు
దాన మక్షయ్య ఫలదంబు గాననేను
పాత్రుఁడను బీదవాఁడను బౌర్ణమితిథి
వేదవేద్యుని వ్రతము గావింతుదీన.

ఒక్కరూకయైన నొక్కడబ్బైన న
నుగ్రహింపుమయ్య యాగ్రహంబు
వలదు కల్లలిట్లు పలుకఁగాఁ జనునె మం
గళములందు పథము గాదుసుమ్మ.

నవ్వి కోమటి కడు హేళనం బొనర్చి
పలికె "దొంగవు ద్విజుని రూపంబుదాల్చి
వచ్చియుంటివి నావలోపలగలట్టి
వంతయును లతాపత్ర చయమ్ము సుమ్ము."

వెంటనే తథాస్తటంచు నాద్విజుండు చనియె
నిత్యకృత్యంబులను దీర్చి నిలిచి చేరి
తేలియాడెడి నావపై దృష్టిబఱపి
విస్మయంబంది మిక్కిలి భీతిజెంది.

భోగములుదీసి మూతలు లాగి పెట్టె
లను బరీక్షించి పత్రపల్లవలతాది
కములు నిండియుండుట గాంచి కనులుమూసి
నిట్టనిలువున మూర్ఛిల్లి నేలఁగూలె.

వెలకన్న నెక్కుడు వెలగట్టి యెన్నొ ప్ర
మాణికములతోడ మాయజేసి
పిసి కేబులమైన గోసి తూనిక తూచి
పలుకులలో గౌరవంబు జూపి
పదికి నూఱులువేలు వడ్డీలుబెంచి య
బద్ధ మాడఁగ జంకు వదలివేసి
న్యాయధర్మములను నఱకి ముక్కలుజేసి
జాలిగుణంబును గిలిగలిపి

గంజిలో నింత యుప్పైన గలుపకుండ
త్రావుచెట్టులో జీవయాత్రను ధనార్జ
నాభిలాషతోఁ గడపు బేహారి సొమ్ము
నిలుచు నెన్నాళ్లు? పరమాత్ముఁ డలుగకున్న?

శ్రీరాముని స్మరణములో
ఘోరాఘము లెప్పుడు చేయు కుహనాభక్తుం
డేరీతిముక్తిగాంచును?
నారాయణ రూక్ష వీక్షణ జ్వాలలచేన్.

శ్రమతో సంపాదించిన
తమ సొమ్ము నశించె దేవతామహిమన్, దుః
ఖము పెట్టెలలో దమహృద
యములన్ నిండినది భారమై పీడకమై.

విలపించెడిశ్వశురునితోఁ
బలికెను జామాత యేడ్చి ఫలమేమి ద్విజుం
డలిగి శపించెను సర్వ
జ్ఞులు మంత్రజ్ఞులును బ్రాహ్మణులుదాపసులున్.

ఈతఁడు విప్రరూపము ధరించిన సత్యవిభుండొ ధాతయో
భూతగణాధినాథుఁడొ ప్రపూర్ణతపోనిధి కాకయున్న నీ
రీతి సమస్త విత్తము హరించునె యొక్కక్షణంబులోన నే
హేతువుచేతనైన గరుణించఁగ మానఁడు జాలిగుండెతోన్.

ధనము బత్రాదికముగ మార్చిన మహాత్ము
డిపుడు, దయజూచి ధనముగావించఁగలఁడు
శరణువేడుము మిక్కిలి జాలిగలుగు
నట్లు వడి యేడ్చి వరలాభమంది రమ్ము.

అతని వాక్కులు కొంత ధైర్యంబు కూర్ప
బలుకు బలుకున విప్రుని పాలికఱిగి
గట్టిగా దత్పదంబులు బట్టి దండ
మిడుచు భక్తిభావముతో నుతించసాగె.

జయ జయ యఘభంగ జయఖగేశతురంగ
జయ కరస్థరథాంగ జయశుభాంగ
జయ జయ భవనాశ జయభక్తజనతోష
జయదశవిధవేష జయరమేశ

జయజయ గోవింద జయమహానంద
జయ నుతమునిబృంద జయముకుంద
జయజయ మధువైరి జయనిగమవిహారి
జయ ఖండితసురారి జయమురారి

సత్యభామా మనోహరా శరణు శరణు
సాధురక్షణ తత్పర శరణు శరణు
సకలకామ్యప్రదాయక శరణు శరణు
సత్యనారాయణప్రభూ శరణు శరణు.

జయజయ సురముని సన్నుత పాదాబ్జ
అబ్జవిశాల నయన నమామి
జయ జయ భక్త రక్షాదీక్ష భవహర
హరమిత్ర మంగళకర నమామి
జయ జయ దారిద్ర్యభయ తమోభాస్కర
కరగృహీతావనీధర నమామి
జయ జయ భవకల్మష నిబిడ గహన ద
హనదయా కువలయావన నమామి

జయ రమాహృత్కమలభృంగ జయశుభాంగ
జయ చరాచరభూతాత్మ జయమహాత్మ
జయసగుణ నిర్గుణాతీత జయవిధాత
జయ నిగమవినుతానంద జయముకుంద.

భువనేశ! ధనమదంబున గన్నుగానక
నీయెడఁ జేసిన నేరములను
సత్కృపాంభోధివై క్షమియించుమా దాస
దాసుండను మహాత్మ తప్పుసైచి
దీనాతిదీనుండ నైన నాపైన గా
రుణ్యంబుచూపు సరోరుహాక్ష
నిగమముల్ గూడ వర్ణించజాలని నీదు
గుణగణంబులను వాక్రుచ్చగలనె

మనుజుఁడను జ్ఞానహీనుఁడ మాయగప్పి
నిన్ను గుర్తించలేనైతి నీవు ప్రోవ
కున్న నాకేది దిక్కు లేకున్ననీ ప
దాబ్జములు వీడనయ్య దయాంతరంగ.

తత ఘోరహింసానిరతుని యనంత దు
ష్కర్మాభిరతుని నక్తందినములు
పాపమార్గంబున బడిపోవువానిఁ గృ
తఘ్ను నిందిత చరిత్రంబు వానిఁ
గలనైన దనపేరు దలఁచకున్నను మహా
పత్తివేళల సర్వపాపహారణ
రక్షింపఁగా వేగరావె కృపాంబుధీ
దీనావనా వాసుదేవ యనుచు

నొక్కసాటి దలంప బాహువులు సాచి
యతని దరిజేర్చి ప్రేమించి యాదరించి
ప్రోవుచుండెదు సత్యదేవుఁడవు నీవ
జాలిగుండె గలాఁడవు సాకుమయ్య.

తనశక్తి గొప్పదైనను బ్రతిజీవి క
ష్టసుఖమ్ములకు దానుజనక వారి
కర్మము బట్టియే కలుగునుగాక పై
రెండు నటంచు స్థిరీకరించి

కర్మకుఁ దనశక్తి కల్పించి చిద్విలా
సమున నానందించు చమితకృపను
సులభమ్ముగా మనుజులకు దర్శనమీయ
నెంచి రత్నాద్రివసించి సత్య

దేవనామంబుతోఁ గర్మ తెగుట నేఁడు
వణిజునకు దర్శనంబిచ్చి వాంఛలెల్ల
దీర్పనెంచి లసద్దయాదృష్టిఁ జూచి
చేరితో బల్కె నో యవివేకి వినుము.

ధననాశనమ్ము చేతం
గనులు విడెన్ నేఁడునీకు గలుషాత్మ, వివే
చనమును వీడి తిరస్కృతి
యొనర్చితివి దాన దుఃఖమొందఁగ వలసెన్.

వ్రతము నేతునటంచు నిశ్చితముచేసి
విత్తలోభంబుచేత గావించవైతి
విత్తలోభమె నిన్ను నీవిధి యసత్య
భాషిగావించె జ్ఞానమిప్పటికిఁ గలిగె ;

నిను బరీక్షింపనెంచి బ్రాహ్మణుని రూపు
దాల్చి యిటు వచ్చితిని మదాంధత నెఱుంగఁ
జాలవైతివి యనిపల్క సత్యవిభుఁడు
పలికె బేహారి యేడ్చుచుఁ బ్రభునితోడ.

దేవా నీమహిమంబు పద్మజముఖాదిత్యప్రభుల్ గాంచఁగా
భావించంగ నశక్తులన్న జడుఁడం బాపుండ సంసార మా
యావైతత్య తమః పరీవృతుఁడనై యాశాపిశాచంబు న
న్నేవేళం బనిపట్టి వేపుటయు నిన్నెట్లెంచఁగాఁ జాలుదున్.

నీమాయాద్భుత లీలలున్ మహిమయున్ నీరూపమున్ శక్తులున్
స్వామీ వేలకొలంది యేండ్లు దపముంగావించియైనన్ మునీ
శామర్త్యేశులు గాంచఁ జాలరనుచో నత్యంత పాపాత్ముఁడన్
నే మూఢుండ నెఱుంగనేర్తునె నినున్ నిత్యానుకంపానిధీ.

ధనలోభంబు స్వభావసిద్ధ మెవఁడో ధర్మాత్ముఁ డెచ్చోటనో
తన స్వార్థంబును వీడి చేసెడినిగా దానంబు, నే నందులో
వణిజుండన్, ధనతృష్ణతీఱ దతిమాత్రంబయ్యె నావట్ల నే
ననఁగానేల నెఱుంగవే తతకృపావ్యాపార సర్వేశ్వరా.

నీసందర్శన భాస్కరోదయముమం దేహద్విపాభీల దు
ర్వ్యాసంగత్వ శితాంకుశంబు శృతిసారానర్ఘ మాంగళ్యసు
శ్రీసంభావ్య మనుగృహీంత జగతీస్నేహాంబు సంసార మా
యా సంకీర్ణ తమోపహాంబు కరుణాత్మా దైవచూడామణీ!

ఎవ్వని యానచే జగములెల్ల జనించునో నాశమొందునో
ఎవ్వని యానచే గ్రహములెల్ల యథావిధి సంచరించునో
ఎవ్వనిశక్తి యిట్టిదని యెంచగరాని విధంబౌ జ్యోతియై
యెవ్వఁడు భాసమానుఁడగు నెల్లపు డట్టిహరిన్ స్మరించెదన్

నీకరుణా సుధాంశురుచి నిత్యము దుష్టసరోజ షండముం
గాకలబెట్టు టొక్కటియెగాదు నిమీలిత మొందజేసెడిన్
జీకటి మూకలం దఱిమి శీతలశాంత మయూఖ వర్షపున్
రాక యొనర్పఁగా శ్రిత పరంపర యేలఁదపించు నీశ్వరా.

నీమహిమంబు నీకరుణ నీచరితంబులు వక్తయైననుం
బాములఱేఁడు చెప్పగలవాఁడని చెప్పఁగరాదు లోకర
క్షామణి, పూర్వపుణ్యముల సారముచేతనె నిన్నుగంటి నా
కామితవల్లి నాపదయుగంబున జుట్టెనహో అయత్నమై.

స్వామి, ఆపత్తులందె నీస్మరణగలుగు
గాదె మానవులకు నాకు జ్ఞానమిపుడు
కలిగె మాయాతమస్సులు దొలఁగిపోయెఁ
గాన నాపత్తులే నాకుఁ గలుగనిమ్ము.

కనులు కాయలుగాచె శ్రీకాంత నీదు
దర్శనం బెప్పుడాయని తావకీయ
మంగళాకార దర్శన మాత్రముననె
జనన మరణాది దుఃఖసంచయము డిందు.

శరణని వేడిన వారినిఁ
బరమకృపాభావమునను బాలింతువుగా
మఱువక నీ వ్రతమును ని
ర్జరు లచ్చెఱువందునట్లు జఱిపెద ననఘా.

క్షమియించుము గరుణించుము
సమయంబిదె సేయుచుంటి జగదీశ్వర, భూ
తములన్నిఁట నుందువు గా
దె ముకుందా, నామనస్సు దెలియఁగలేవే?

భక్తితో నాతఁడీవిధిఁ బ్రార్థనంబు
జేయుటయు సత్యదేవుండు స్వీకరించి
కరుణతో మందహాసంబు బఱపి పిదప
నచటనుండి యంతర్ధానుఁ డయ్యెనంత.

పటుమాయాద్భుత చరితుం
డట లోకావన వినోదుఁడట భక్తుల సం
కటములు వాపెడునట కో
మటి భక్తుని కీయలేఁడె మహితశుభంబుల్.

దేవదేవుని కృపాభావంబునకు జిత్త
మున హెచ్చియున్న సమ్మోదగరిమ
"నేమయ్యె బ్రాహ్మణుం డేమనె" నని యల్లుఁ
డడుగు ప్రశ్నలు వినంబడనియట్లు
కల్లుద్రావినట్లు మైకము గ్రమ్మినట్లు ద
య్యము పట్టినట్లు రయంబుతోడ
నున్మత్తుని విధాన నొక్క పఱ్ఱున మూత
లూడ్చిన పెట్టెల నొక్కసాఱి

యూగుచుండిన యానావ నొక్కసారి
గాంచి తొల్లిఁటి ధనమెల్లగాంచి నావ
బరువుతో నిండియుండుట యెఱిఁగి సత్య
దేవ దాసోహమనుచు న ర్తింపసాగె.

కనుగవ బాష్పాంబువులుఁ
దనువున బుల్కలు జనించెఁ దడబడె మాటల్
మునుపటి భాగ్యంబులు దన
కనులం బడినంత నతఁడు గాద్గదికముతోడన్.

సత్యదేవుండె యాద్విజస త్తముండు
మించు దోసఁగులు మఱచి క్షమించినాఁడు
జాలిగలవాఁడు బీదలనేలు పెన్ని
ధానమని చెప్పు చతఁడు సంతసము బొందె.

తనయథాపూర్వ రత్న కాంచనములిపుడు
నిండి యుండుటగాంచి వణిజుఁడు నచట
గలుగువారలు ముదితులై చెలఁగి రంత
వ ర్తకుఁడు దనవారితో బలికె నిట్లు.

చేయఁగవలయును దద్వ్రత
మాయత కళ్యాణదంబు నతిభక్తిగ రం
డో యనఘాత్మకులారా
తీయని ఫలమిచ్చు సత్యదేవుం డెలమిన్.

ఆపడవయందె బంధుమిత్రాదులెల్ల
బలిసి కొలువఁగ సత్యదేవవ్రతంబు
జేసి మఱునాఁడె తమయూరు జేఱుటకయి
నావ త్రోయించె వర్తకనాయకుండు.

అనుకూలవాయువులు వీ
చిన గని నావికులు నావ జెచ్చెఱనడిపిం
చిన గని మెచ్చుచు నల్లుని
గని వర్తకుఁ డిట్లు పలికె-గడు మోదముతోన్.

మన భద్రాగమనము నె
మ్మనముల స్వస్థతయు దెలుప మనయింటికి దూ
త నొకని వేవే పంచుట
యనువుగదా మనకు ననిన నొాగాకనుచున్.

ధన రక్షకుఁ డగు తమదూ
తను దమ కుశలాగమన విధమ్మెఱిఁగింపం
బనిచిన నతఁడున్ రయమున
జని వణిజుని భార్యతోడ సర్వము దెలిపెన్.

నికటమున భూరిరత్నమాణిక్యనివహ
యుక్తుఁడై యల్లునిం గూడి యున్నవాఁడు
సౌఖ్య సముపేతుఁడై యదే సాధువనుచుఁ
బల్కుటయు వైశ్యపత్ని సంభ్రాంతయగుచు,

సత్యవిభుని వ్రతము జఱుపుచునున్న కు
మార్తె జూచి బిడ్డ మంగళములు
సేఱుచుండె మనకు శ్రీహరి కరుణచే
దీనజనుల బ్రోచు దేవుఁడతఁడు.

వ్రతమొనరించువారికి నిరంతర సౌఖ్యములున్ శుభంబులున్
హితములుఁ గూర్చు సత్యవిభుఁడే కరుణించెను-చేయుచున్న యీ
వ్రతమును బూర్తిచేసి పిదపం జనుదెమ్ము నదీతటంబునం
బితయును భర్తయుందు రిదె వెళ్లెద ముందుగ నేఁ గళావతీ.

రేవు చేరెను నావ చేరియును జుట్ట
ములును దీరము జేరి పెట్టెలను దింపు
చుండ నల్లుండు నావపై నుండి వస్తు
వులను దింపించుచుండె నీవలకు నంత.

చను దెంచిన తన పత్నిం
గని సేమంబడిగి పుత్రిఁ గను వేడ్కను దె
ల్పిన వ్రత మొనరించుట దె
ల్పెను లీలావతియుఁ గుతప వేళ కచటికిన్.

వచ్చెను గళావతియుఁ దండ్రిఁ బతినిగాంచ
వ్రతముచేసి ప్రసాదమ్ము నదలివేసి
సత్యదేవుండు తన తిరస్కార మిట్లు
జరుగఁగాఁ జూచి క్రోధవీక్షణము బఱపె.

ఆతని కోపము చేతం
బోతముతో సకలవస్తువులతోడన్ జా
మాతమునింగె హఠాత్తుగ
లోతుగ లేనట్టి జలములో వింతగదా!

చిత్రమిది యంచు బలుకుచుఁ బుత్రియేడ్చు
చుండఁ దల్లియుఁ దండ్రియు నున్నవార
లందఱును దుఃఖపూరితులైరి దైవ
కోపమున కద్భుతగులుటకుం దరంబె?

పోయిన ధనంబు క్రమ్మఱఁ బొందవచ్చుఁ
బోయినట్టి యల్లుని నెట్లు బొందవచ్చుఁ?
దనకుమార్తె యవస్థకుఁ దల్లడిల్లి
పలికె లీలావతియొ - తన భర్తతోడ.

ఇప్పుడేగద చూఁచితి మిచట నావ
పైన నల్లుని ధనమణివస్తువులను
దింపుచున్నట్టి వానిని దెలియఁబోవ
దింతలో నింతయయ్యె నింకెంత యగునో?

చిరకాలంబున కేగుదెంచెఁబతి రాశీభూతమై మిక్కిలిన్
విరహంబిట్లు దవానలంబు పగిదిన్ వేధింపఁ గష్టమ్ములున్
విఱుగున్ సౌఖ్యము లందవచ్చునని భావించంగ హర్షించెఁగాఁ
దరుణీరత్నము భర్తతోముచ్చుగు బోతంబున్ విలోకించుచున్.

భోరని యేడ్వసాగె సుఖభూతికరంబున బెట్టిలాగి న
ట్లారయ సిద్ధభోజనము నావలకుం బడద్రోబ్బినట్లుగా
దూరమునుండి వచ్చిన వధూనవమోహకుఁడైన భర్త యీ
తీరుగ నయ్యొ నామెపరిదేవనమున్ విని యాల్గరంగవే.

తనమగఁ డిట్లు నావసహితంబుగ నీట మునింగిపోవఁగాఁ
గనిన కళావతీలలన ఖండితవల్లివిధాన మూర్ఛచే
తను బడిపోయె నచ్చటనె తల్లియు దండ్రియు బాంధవాళి రో
దనములు నింగినిండె విధితంత్ర మెఱుంగఁగ శక్యమేరికిన్ !

పతిమరణంబుచే వికలభావము జెందు మనస్సుతోడ సం
తతమును గన్నుదోయిబడి ధారలుగట్టఁగ నశ్రువుల్ స్వజీ
విత మిఁక శూన్యమాచుఁ గనుపించఁగ నేడ్వదొడంగె నా కళా
వతి కురరీవిధంబుగను బాలపికారవకాకలీధ్వనిన్.

ఘన శోకాతురుఁడై యు
ల్లుని వెదకుటకై జలమ్ములో బెస్తల బం
చిన వారును విఫలత జెం
దినవారై మగిడివచ్చి తెలిపి ర దెల్లన్.

తల్లిదండ్రులు సకలబాంధవులు భృత్యు
లీ హఠాత్సంభవాపద హేతువిది య
టం చెఱుంగగ లేక చింతించుచుండఁ
బలికె లీలావతియె తెల్వి గలదియగుట.

భాగ్యభోగ్యమ్ములెల్ల రూపఱిన యపుడు
దిఱిపె మొత్తుచు నింటింట దిఱుగునపుడుఁ
గలుగకుండిన పెన్వెతల్ గలిగె నిపుడు
పట్టె దురవస్థ గుండెలు వ్రక్కలించె.

చిలుకయు గోఱింకల బలెఁ
గులుకుచు నాయింట తిఱుగఁగూతును నల్లుం
దిలకించుచు ముఱిసెడు గ
న్నులతోఁ బతిహీనసుతఁ గనుంగొనఁగలనే.

మనుమలఁ జూచుభాగ్యమది మా నోసటన్ విలిఖింపలేదు గా
వున నతఁ డందఱిన్ విడిచిపోయెను వంశము నుద్ధరించఁగా
మనుమలు గల్గి యెల్లెడల మాకు ముదంబొనగూర్తు రంచుఁ ది
య్యని తలఁపుల్ తలంచితిమి యన్నియు నేఁడు నశించె దైవమా.

సత్యనారాయణప్రభూ జనులమైన
మమ్ము నిట్లు శిక్షింప ధర్మంబె నీకుఁ
దప్పులే చేసి యుంటిమి తప్పకుండ
గణన చేతువ! దీనరక్షక పరాక?

తనసతిపల్కుల చేతన్
వణిజునకున్ సత్యవిభుఁడు — వ్రతదైవము — తద్
ఘనకారుణ్యము — దీనా
వనబిరుదము దలఁపువచ్చి పలికెన్ వగతోన్.

నీ మహిమంబుచే గలుగ నేరని దెద్ది పరాత్పరా భవో
ద్దామ తమఃప్లుతుల్ నరులు తావక మాయయెఱుంగ నేర్తురే
స్వామి జొహారు - నీ చరణసారసపూజలు మాన బోము దే
వా, మనసార గొల్చెదము పాలనసేయవె దీనవత్సలా.

నావిభవోన్నతి తోడన్
దేవా నీవ్రతముజేతుఁ దీర్పుము కోర్కుల్
భావింతెదఁ బూజించెద
రావే యాపదలు బాపరావే, వినవే.

భక్తితో వారుచేసిన ప్రణుతి గాంచి
సత్యనారాయణస్వామి సంతసించె
వారి కష్టమ్ములెల్ల బాపంగఁ దలఁచి
కృపను బల్కె నిట్టుల నశరీరవాణి.

వ్రతముజేయుచు పెన్మిటి రాక తెలిసి
భర్తపైగల యనురాగవశత నా ప్ర
సాదము భుజించకుండ నిరాదరణ మొ
నర్చె నీపుత్రి దాన బన్నమ్ములొదవె.

పరమాత్ముని యానతిచే
బఱుగున దనయిల్లుచేఱి భక్షించెను ప్ర్బం
ధుర భక్తితోఁ బ్రసాదము
స్థిరముగ డెందాన భక్తి దీటుకొనంగన్.

తత్తరమ్మున వాహినీతటముజేఱి
ఆసచూపులు నదివైపు నచటిజనుల
వైపునకు భూనభోసీమవఱకుఁ బఱపె
నేడుగడ యైన మగని గాంక్షించుకొఱకు.

తొలుత వచ్చినవేళ నాలలన కచటి
జంగమస్థావరాత్మక స్థలము ప్రళయ
రౌద్రభీభత్సరూపమై రక్తరంజి
తారుణంబయి తోచి భయంబు గూర్చె.

ఆ కళావతి కనెనిప్పు డాస్థలంబు
శాంతమై యమృతజలంబు జల్లినట్లు
హర్షదాయకమై సురోద్యాన మట్లు
మధురసంగీతమయమహాచు మంజులముగ.

వడగాడుపుచేఁ గటకటఁ
బడిడస్సి నరుండు దాహబాధితుఁడైన
వ్వాడు చల్లని నీరములం
గనుజల్లని నీడపట్టు గాంచిన పగిదిన్.

పరమాత్ముండగు సత్యదేవుని కృపాభావంబు సంపూర్ణమై
వఱలన్నావయు నావమీఁద మగనిన్ స్పష్టంబుగాఁజూచి యా
యరవిందేక్షణ యాకళావతి హరీ యబ్జాక్ష శ్రీరుక్మిణీ
వర ధన్యాస్మి యటంచు మ్రొక్కె శిరసా భక్తిం బ్రమోదాత్మయై.

సురరాజులు మునిరాజులు
నిరతం బేవరదు చరణ నీరేజములం
బరిపరివిధముల దలంచియు
నెఱుఁగంగాలేని కరుణ యీామె గడించెన్.

ఘోరదారిద్ర్యాంధకారంబు నడపంగఁ
గాంతిపుంజము త్రివిక్రముని సేవ
భవవిపద్గంభీర పాథోధిగడపంగ
సొగసైన నావ యచ్యుతుని సేవ
సంసారదుఃఖ పాశచయంబు ద్రెంపంగ
బదునైన కత్తి శ్రీవరుని సేవ
సకల పాపౌఘ వైశ్వానరార్చుల నార్ప
నమృతవర్షము చక్రహస్తు సేవ

అఖిలసౌఖ్యంబు లిచ్చు మురారి సేవ
అవ్యయానందమిచ్చు దైత్యారి సేవ
చరమముక్తి కిత్రోవ కేశవుని సేవ
వివిధకామ్య ప్రదము సత్యవిభుని సేవ.

బ్రదికివచ్చిన జామాత వచ్చి ఎదుట
దండమిడుచుండ గని వైశ్యదంపతులును
గదియజేరిచి ప్రేమతో గాఁగిలించి
హర్ష బాష్పాంబువులు గార్చునవసరమున.

జనకుని గాంచి కళావతి
యనెఁ "దండ్రీ యిక విలంబ మధియేల గృహం
బున కేగి సత్యనారా
యణ దేవుని వ్రతము జేసి యర్చించదగున్.

అనుచుదల్లి దండ్రి యాప్తులు వెంటరా
గీముజేరి దేవగృహము జక్క-
దిద్ది సకలజనులు దృప్తిబొందెడునట్లు
వైభవము జెలంగ వ్రతము జేసె.

చేతులనుమోడ్చి భక్తితోఁ జిత్తములను
సత్యనారాయణస్వామి చరణ జలజ
ములను లగ్నము గావించి లలిత వాక్ప్ర
సూనముల బూజగావించఁ జొచ్చిరిట్లు -

చతురాస్యుం గికురించి 'వేదసమితిన్ జౌర్యంబు గావించి క్షి
ప్రత బర్వెత్తిన సోమకాసురుని బారావార మధ్యంబునన్
మృతుగావించి విరించికిన్ మఱల బ్రామిచ్చిన్ సమర్పించి త
న్నుతులంగాంచిన మత్స్యమూర్తిహరినిన్ యోజింతుమశ్రాంతమున్.

గిరి మంథానముజేసి రజ్జువుగ భోగిస్వామి గావించి హా
చ్చుతికన్ క్షీరపయోధి నిర్జరులు రక్షస్సంఘమున్ ద్రచ్చుచో
బరువై యాగిరి మున్గం జొచ్చుటయు నాపై నిన్ను బ్రార్థింపం జె
చ్చెఱబై కెత్తిన కూర్మమూర్తి హరినిన్ సేవింతుమశ్రాంతమున్.

వరగర్వాతిశయ ప్రమత్తుం బ్రకృతి ప్రత్యర్థితానేక దు
ర్భరదాష్ట్యాచరణప్రవృత్తు ధరణీభార ప్రతీకాశు ని
ర్జరవిద్వేషు హిరణ్యనేత్రు దిగధీశశ్రేణి మోదింప స
త్వర ప్రమందించిన క్రోడమూర్తిహరినిన్ ధ్యానింతుమశ్రాంతమున్.

డింభా లేడురా లేడు విష్ణుడన దండ్రీ యున్నవాండెందు నీ
స్తంభంబందున జూపరా యనుచుం జేతం గొట్టగాం బుట్టి యా
దంభోద్రిక్త హిరణ్యకశ్యపు నెడందం జీల్చి ప్రహ్లాద చి
త్తాంభోజంబు జిగుర్ప జేసిన నృసింహా కొల్తు మశ్రాంతమున్.

అతిధర్మాత్మకుఁ డయ్యు దేవతల రాజ్యంబున్ బిరుల్ లాగి ప
త్వాతలంబెట్టి త్రిలోకనేతయయి పాలించంగ నీ వర్థివై
క్షితి మూడడ్గులుగోరి దాత బలి వాసిన్ నిల్పి పాతాళ భూ
క్షితుగా జేసిన వామనాకృతి హరిన్ సేవింతు మశ్రాంతమున్.

ఘనధానుష్కులు చండశాసనులు దుష్కర్మానురక్తుల్ కళం
క నిధుల్ గోద్విజహంతలున్ నిజబలాఖండాభిమానోగ్ర వ
ర్తను లా హైహయ వీరులం బరశుతీవ్రస్ఫారధారన్ వధిం
చిన శ్రీభార్గవరామమూర్తి హరినిన్ సేవింతు మశ్రాంతమున్.

సురకాంతా కచకర్షణాధిక విలాసుం గిన్నరీ మాన త
స్కరధారేయు మునీశయాగశిఖి వర్షాకల్పుఁ బ్రాపంచికాం
తర శాంతిస్థిర ధూమకేతువును లంకానాధునిం దత్సహో
దరునిం జంపిన రామమూర్తి హరినిన్ ధ్యానింతుమశ్రాంతమున్.

దితివంశోద్భవ రాజలోకము సమందీభూత హింసా ప్రకం
పిత భూనాకము జేదిభోజ మగధోర్వీవల్లభానీకమున్
స్మృతిమార్గ వ్యతిరేకమున్ వసుమతీక్షేమంబు గాంక్షించి దు
న్మితివా యాదవకృష్ణమూర్తి హరి నిఁ సేవింతు మశ్రాంతమున్.

బలిపీఠంబున నోరులేని పసులన్ బంధించి బాధించు య
జ్ఞాల హింసారతమైన దుర్మత దురాచారంబులన్ మాన్పి జీ
వులఁ బ్రేమించి పవిత్రశాంతి కరుణాంబుస్నాతులం జేసి ధ
న్యులుగా జేసిన బౌద్ధమూర్తి హరినిఁ బ్రార్థింతుమశ్రాంతమున్.

ఆశాపాశ నిబద్ధి తాత్ముల ధనవ్యాపారకాంతా సుఖా
వేశోల్లాసకళంకవర్తనుల బృధ్వీనేతలం జంపి యీ
దేశం బెల్లెడ వర్ణధర్మ విధులన్ దీటించి భాసిల్లు నే
యీశుం డాతని గల్కిమూర్తి వరదాయింగొల్తుమశ్రాంతమున్.

తన పరివారమెల్ల సమదంబున మిక్కిలి మెచ్చుచుండ వి
డని గురుభక్తితోడ గరుడధ్వజ పూజలొనర్చి మించి యా
వణిజుఁడ క్షేమభోగములనంది కృతార్థతజెందె సత్యదే
వుని పదపద్మముల్ గొలుచు పుణ్యులకెందును లేవు లోపముల్.

ప్రతినెల పౌర్ణమి తిథులం
దతిభక్తిగ వ్రతముచేయు నైహికసౌఖ్యో
న్నతులంది యంది పిమ్మట
నతి దుర్లభమైన మోక్షమందె మహర్షీ.

## ౭

శ్రీనగజాశంకర స
న్మానిత పాదారవింద నతముని బృందా
ధ్యానాతత గానామృత
పానావృతభక్తచిత్త వనజమిళిందా.

మురవైరి నారదునకుం
గరుణామతి జెప్పియున్న కలికల్మషసం
హారణంబగు మంగళతర
చరితము సూతుండు చెప్పసాగె మునులకున్.

కలఁడు తొల్లి యంగధ్వజక్ష్మావిభుండు
న్యాయధర్మైకశీలుండు నళిననేత్ర
చరణసేవాపరాయణుం డురుగుణాఢ్యుఁ
డై ప్రజావత్సలుండయి యశముగాంచె.

ఆతం డొక్క దినంబునందు మృగయావ్యాపారమేపారఁగాఁ
జేతన్ విల్లు ధరించి కాననమునన్ సింహేభశార్దూల సం
ఘాతమ్మున్ శర శ్రేణి శోణితతులన్ ఖండించి ఖండించి ఖ
ద్యోతాసహ్యమహోష్ణతాపగతిచే దోధూయమానాంగుఁడై.

తను వవశత్వ మొందుటయు దత్ క్షణమాత్రుఁడు విశ్రమించఁగా
మనమునఁగోరి యొక్క వటమంజుల వృక్షము నీడఁ జేరి కాం
చెను నరపాలుఁ డచ్చట విశేషముదంబున గూడి సత్యదే
వుని వ్రతపూజ చేయుటకుఁ బూనిన గోపకుమారవర్గమున్.

వారలు భక్తిచిత్తులయి పాతక నాశక మావ్రతంబు నిం
పారఁగ జేసి భూరివినయంబున జేతులుమోడ్చి భూపతిం
జేటి ప్రసాదమిచ్చుటయు జేకొననొల్లక దానినిం దిర
స్కారమొనర్చె ఱేఁడు తనగౌరవముం గులముందలంచుచున్.

తనకులముం బ్రతిష్ఠయు నితాంతగరిష్ఠములంచు గర్వ సం
జనిత మదాంధకారమున జక్కఁగ గన్నులు గానరాక యా
జనపతి గోపపుత్రకృత సద్వ్రత మించుకయైనఁ జూడఁగాఁ
జనఁడు నమస్సు జేయఁడు నిజంబున కంతటిమూఢులుందురే?

మానవేంద్రుండు తిననిమ్ము మాననిమ్ము
ఎగ్గుమన కేల ననుచు వారెల్ల అప్పుడు
తతముదంబున సత్యేశు దలఁచి కొలిచి
తత్ప్రసాదంబు గొనిరి సద్భక్తితోడ.

"భ్రాంతిన్ వీడుమ సత్యదేవుని ప్రభావంబన్న సామాన్యమా
ఎంతో భక్తిగ నన్ను నీకొసగిరోయీ రాజ, నైకొమ్ము స
ర్వాంతర్యామి పరాత్పరుం" డనుచు సంభావించి గోపాలక
భ్రాంతుల్ దెచ్చిన యాప్రసాదమనియెం బాటింపఁ డాతండహో.

వేటముగించి భూమిపతి వీంద్రముతోఁ బరివారయుక్తుఁడై
వీటికిబోవుచున్నయెడ వేగమకంచుకి చేఱవచ్చి యా
రాటముచేత మాటలు భరంబగుచుండఁగబల్కెసాగెః "నిం
కేటికి రాజ్య మేటికి మహీసుఖముల్ తనువేటికో నృపా.

మీరిటువచ్చినంతనె యమిత్రులు పెక్కుఱు రాజధానిపై
ఘోరముగాఁ దటాలున శకుంతములుంబలెదాడిచేసి మీ
వీరకుమార వర్గమును వేఁ జెఱసాలలఁ బెట్టియుంచియు
న్నారిక మిమ్ముగెల్చు జతనంబుననుండిరి పెద్దపెట్టునన్.

నమ్మినబంటు లిట్లదనునం బగవారలజేఱి స్వామి కా
ర్యమ్ములకున్ విరుద్ధముగ వక్కట మోసముచేయుచున్న రా
జ్యమ్ములు నిల్చునాధరణి చంద్రుడు-సూర్యుఁడు నిల్చునా మహీ
ధ్రమ్ములు బెండులై చనవె దైవము మెచ్చునె కీర్తివచ్చునే."

వజ్రసంకాశమైన యీవార్త విన్న
నృపతి చైతన్య హీనుడై నేలవ్రాలె
దాపునంగల పరిజన దత్తశీత
లోపచారంబులం దేఱి యుండునంత.

గరువమువీడి శాంతమగు కన్నులతో దిలకించిచూడ భూ
వరునకు నంతరాళమున స్పష్టముగాఁగనవచ్చె నొక్క భా
స్వరసుఖ శీతలంబగు ప్రభాపటలం బును దానిలోన సుం
దర నయనాభిరాముఁడగు దైవశిఖామణి సత్యదేవుఁడున్.

కని మేను పులకరించఁగ
ననిమిష నేత్రములతోడ నటుచూచెడు న
జ్జనపతికి దోఁచె మనమున
మునుచేసినతప్పు స్పష్టముగ నాతండున్.

చారుసుదర్శనుండు దివిషన్నుతపాదసరోరుహుండు సం
సార విపత్తమోద్యుమణిసన్నిధి జాగిలిమ్రొక్కిపల్కె — శ్రీ
కార భవన్మహామహిమ గాంచగలేక ప్రసాదముం దిర
స్కారముచేసి పుత్రశతకంబును రాజ్యముగోలుపోయితిన్.

విడె గన్నుంగవతో నె
ప్పుడు వీడని గర్వభావమును, దోడ్తో నీ
యడుగుందమ్ములపై నే
ర్పడియెన్ దృఢ భక్తిపూర్ణభావము గూడన్.

చంచలమైన సంపదలు శాశ్వతమంచు దలంచి క్రిందుమీఁ
దించుకయైన గుర్తిడక యెవ్వఁడు మూఢత సంచరించుఁ బ్రా
పంచిక భోగమత్తుఁడయి పాపములెంచక విఱ్ఱవీగు ఆ
పంచజనుం డశక్తుఁడగు బాపురె! దైవము వాఁడిచూపులన్.

పురుషకారము దైవసుముఖత గాని
ఫలము జెందదు సుప్తుండు పాముచేత
మ్రందునట్లు గర్వోద్రిక్త మానసమున
సకలముం గోలుపోయితి శాస్త్రిగంటి.

సకలభవరోగములకు నౌషధవరంబు
సత్యదేవుని నామసంస్మరణ మొకఁడె
తెలియనైతి మరీచికాజలము ద్రావ
నెంచు సారంగమట్లు గుర్తించలేక.

చేసితి దప్పు, నీమహిమచేత సమస్తము ధూళిగ్రుంగె స
జ్జ్ఞాసన ముఖ్యదేవతలకైన యెఱుంగఁగరాని నీపనుల్
వాసవవంద్య నాకెఱుఁగవచ్చునె యీవిపదగ్నికీలలన్
నా సకలాభిమానము వినాశనమై శుచిబుద్ధి యేర్పడెన్.

చేయఁగరాని దోసమును జేసితిఁ దత్ఫలమందుకొంటి నీ
మాయయె నాఁడు కూర్చినది మత్తత, వీడెను నేఁడు, గాన కం
దోయి విడెన్ యథార్థము గనుంగొనఁ జాలితి నింక సత్యనా
రాయణదేవ మంగళకరా శరణార్థిని నన్ను గావవే.

కాలరూపుఁడవైన నీయధికారమున్ గుఱుతించలే
కాలుబిడ్డల భోగభాగ్యమదాదులన్ భవపాపజం
బాల మగ్నుఁడనై చరించి విపత్తులందితి నింకనన్
బాలముంచిన నీటముంచిన భారమంతయు నీయదే.

దోసఁగు కొండంతచేసితి దోషినైతి
జాలి యిసుమంత జూపిన జాలు నాదు
పాపదావాగ్ని నాసౌఖ్యవనము గాల్చెఁ
ద్వత్కృపాదృష్టి పల్లవితముగఁ జేయు.

ఏవృత్తిచే నరణ్యావాస శబరి మం
దాకినియై పుణ్యధామమందె
నేమెయిన్ ధీవరగ్రామణి గుహుఁడు వా
రిదవాహన సమానపదముగాంచె
నేశక్తిఁ బాతకరాశి యజామిళుం
డతిలోక వైకుంఠ మందఁగలిగె
నేబల్మిచే మతిహీన చతుష్పాత్తు
మాతంగరాజు బ్రహ్మంబుజెందె

నెట్టి నైపుణ్యమున జడ మింతియయ్యె
నద్ది నిశ్చల నిష్కామమైన భక్తి
జపతపంబులు దాన యజ్ఞములు వృధలు
భక్తి యొక్కండె యీశ్వరప్రాప్తి పథము.

భక్తులై ధర్మానురక్తులై పరహితా
సక్తులై ముక్తి సంయుక్తులైరి
దాతలై పుణ్యసంధాతలై యింద్రియ
జేతలై పరమార్థ నేతలైరి

జ్ఞానులై సేవాప్రధానులై రాగాది
హీనులై త్వత్కృపాధీనులైరి
యోగులై వాసవభోగులై భోగవి
రాగులై త్వద్దయాభాగులైరి

మందబుద్ధినై నేను నీమాట మఱచి
పరువమును గల్మియరయమి పోరతనంబు
లధికమదము జేకూర్పఁగా నంధుఁడనయి
నిన్ను ధిక్కృతిజేసి పొందితి ఫలంబు.

వేద వేదాంత సంవేద్యాయ సర్వగీ
ర్వాణ వంద్యాయ తుభ్యం నమామి
మునిరాజ కీర్తిత పుణ్యచరిత్రాయ
భవ్యరూపాయ తుభ్యంనమామి
సంసార మోహ పాశలతాల విత్రాయ
అతుల గుణాయ తుభ్యం నమామి
చతురాస్య భుజగేశ సన్నుత చరణాయ
భవవినాశాయ తుభ్యం నమామి

పరమ కరుణాకరుణాయ సంపత్కరాయ
ఆశ్రిత జనావనాయ తుభ్యం నమామి
భక్తహర్ష ప్రదాయ విపద్ధరాయ
వరద, సత్యదేవాయ తుభ్యం నమామి.

గోపబాలురు నేఁడు వైకుంఠపూజ
చేసి తత్ప్రసాదంబు భుజింపుఁ డనుచు
నాకొసంగిరి తిననైతి నాకు నేఁడు
తత్ఫలం బిట్లు సేకూరెఁ దప్పకుండ.

అని యెంచి గర్వమంతయుఁ
జనఁగా శ్రీసత్యదేవు సత్కరుణా పా
వన శీతల గంగాఝరి
మునుఁగఁగ - దుఃఖోపశమనముం గాంచుటకై.

తిఱిగిధరాధిపో త్తముఁ డతిత్వర గోపకు లున్నచోటికిం
బఱువునఁబోయి వారి సహవాసముతో మది భక్తిభావముం
దిరముగ నిల్పి సత్యజగతీధవుగూర్చి వ్రతంబుజేసి యం
దఱు మనసార భక్షణ మొనర్చిరి దేవుని యాప్రసాదమున్.

శ్రీరమణీ మనోహరుని శీతలసత్కరుణారసంబుచేఁ
బౌరజనంబు దండపతివర్గము భూపతిపైన నంతలో
గూరిమి భక్తిగల్గి రిపుకోటిని జీలిచి రాకుమారులం
గారలనుండి వీడ్చి యధికారము రాజున కిచ్చునంతలో.

సిరులిచ్చున్ హరియించు లోకములు రక్షించున్ హరించున్ నిరం
తర కళ్యాణములిచ్చు లాగికొను వేనవ్వించు నేడ్పించు నీ
కరణిన్ నాటకసూత్రధారివలె లోకస్వామి క్రీడించు ద
త్పరతత్త్వాద్భుతలీల లెట్లెఱుఁగఁగావచ్చున్ జడప్రాణికిన్.

విడిచి ప్రసాదము నాఁడా
తడు కడు నిడుమలను బొందెఁ దద్భక్షణ మి
ప్పుడు కావించి శుభంబులు
బడసెఁ బ్రసాదంబుమహిమ బలుకఁగఁ దరమే.

సుత శతకంబును బడసెను
జతురబ్ధిపరీత విపుల సామ్రాజ్యము ద
ద్గత భాగ్యములు లభించెను
క్షితిపతికిన్ సత్యదేవు శీతలదృష్టిన్.

ప్రతి మాసంబున మానక
వ్రతమున్ సద్భక్తిజేసి బహువిధ సౌఖ్యో
న్నతులం గాంచి మహాత్ముల
గతి దుర్లభమైన మోక్షగతియుం బడసెన్.

జనుఁ డెవ్వాఁడు నిరంతరమ్ము వ్రతమున్ సద్భక్తి గావించునో
మనమున్ లగ్నముజేసి యీవ్రతకథన్ మన్నించియాలించునో
ధనధాన్యాదికమున్ శుభంబులును సంతానమ్ము జేకూర్చి యా
తని గాపాడును సత్యదేవుఁ డెపుడుం దథ్యంబు ప్రీతాత్ముఁడై

భయము వాయును భీతుండు, బంధనంబు
బాయు బద్ధుఁడు; దారిద్ర్య బాధితుండు
సకల సంపత్తులనుబొందు సత్ఫలంబు
గాంచి యంతమ్మునందు మోక్షంబు బొందు.

శౌనక ముఖ్యపూత మునిసత్తములార, మురారి యాత్మ భూ
సూనునకట్లు దెల్పిన విశుద్ధచరిత్రము మీకు జెప్పితిన్
గ్లానియు దుఃఖముల్ గలియుగంబున మాన్పఁగజాలు నీవ్రతో
ద్యాన విహారు లందెదరు తప్పక సౌఖ్యఫలంబు లెల్లెడన్.

సత్యనారాయణుండని సత్యదేవుఁ
డనియు గాలస్వరూపుఁడం చనియుఁ బేళ్లు
వరలు బహువిధమైన రూపములతోడ
సత్యదేవుండు కలిని గేశవుఁడు నిజము.

ఎవఁడిద్దానిని భక్తితో జదువునో యింపార నాలించునో
భవదుఃఖమ్ములు వాసి యాతనిని సంపజ్జాలముల్ సేయు మా
ధవుఁడే యన్నవరంబునందుగల సత్యస్వామి నిక్కంబు ని
త్య విభూతుల్ సమకూర్చు జీవతతికిం దత్త్వద్విధిన్ శౌనకా!

మంగళము సత్యవిభునకు
మంగళమగు సుందరీ రమానాథునకున్
మంగళము దివిజనుతునకు
మంగళమగు వేదవేద్య మహితాత్మునకున్.

భవకమలాసన వాసవ పూజిత
భవ్యమనోజ్ఞ పదాంబుజ లో
కవిహిత కార్యవిరుద్ధ విశృంఖల
గర్వితభీకర పార్థివ దా

ననహారణక్షమ చక్రధరా భవ
నాశన దీనశరణ్యా రమా
ధవ కరుణాకర భక్తపరాయణ
దానవశీకర - ధర్మరతా !

అతుల మహితలీలా అవ్యయానందలోలా
నతమునిజపాలా నవ్య సౌవర్ణచేలా
వితతకుమతి భంగా వేద వేదాంతరంగా
వ్రతిమునితతిసంగా భక్తచిత్తాబ్జభృంగా.

సకలభువన భర్తా సాధుసంతాప హర్తా
వికచ కమలనేత్రా విశ్వసమ్మోహ గాత్రా
వికట భయవినాశా విశ్రుతావ్యక్త వేషా
ప్రకటిత భవదూరా భక్త రక్షావిచారా !